| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౧౬ | ౧౦ | వాఁడని జెప్ప | వాఁడని చెప్ప |
| ౨౯ | ౧౫ | వృద్ధిపొందిపుఁడు | వృద్ధిఁబొందింపుఁడు |
| ౬౧ | ౧౨ | యేమి ! | యేమి ? |
| ౬౭ | ౧౭ | అప్రకాశుఁడనైన | అప్రకాశుఁడనైన |
| ౭౯ | ౧౪ | పురోహితములలో | పురోహితులలో |
| ౯౪ | ౧ | రూపము నేఁజూడ | రూపము నేచూడ |
| ,, | ,, | అష్టవసులు | అష్టవసువులు |
| ౯౭ | ౧౧ | పడుచున్నారు? | పడుచున్నారు. |
| ౧౦౧ | ౧౧ | చున్నది యేది | చున్నదనునది యేది |
| ౧౧౪ | ౧౪ | చెప్పఁబడినవి? | చెప్పఁబడినవి. |
| ౧౧౫ | ౨౧ | న. ఁజెప్పఁబడు | నని చెప్పఁబడు |
| ౧౧౭ | ౯ | దానిని గాఁయపుడు | దానిని గానెపుడు |
| ,, | ,, | జూచుచున్నాఁడోఁ | జూచుచున్నాఁడో |
| ౧౧౯ | ౯ | యాత్మ, సాక్షా... | యాత్మసాక్షాత్కార |
| ౧౨౯ | ౪ | జూచుచున్నాఁడు | జూచుచున్నారు |
| ౧౩౬ | ౧౬ | దానమును | దానములును |
| ౧౩౯ | ౧౭ | చేయ | జేయ |
| ౧౪౦ | ౨౦ | బడుచున్నఁది | బడుచున్నది. |
| ౧౪౫ | ౧౧ | బడుచున్నది | బడుచున్నవి. |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౧౬ | ౧౦ | వాఁడని జెప్ప | వాఁడని చెప్ప |
| ౨౯ | ౧౫ | వృద్ధిపొందిపుఁడు | వృద్ధిఁబొందింపుఁడు |
| ౬౧ | ౧౨ | యేమి ! | యేమి ? |
| ౬౮ | ౧౮ | అప్రకాశుఁడ్నైన | అప్రకాశుఁడనైన |
| ౮౯ | ౧౪ | పురోహితములలో | పురోహితులలో |
| ౯౪ | ౧ | రూపము నేఁజూడ | రూపము నేచూడ |
| ,, | ,, | అష్టవసులు | అష్టవసువులు |
| ౯౮ | ౧౧ | పడుచున్నారు? | పడుచున్నారు. |
| ౧౦౧ | ౧౧ | చున్నది యేది | చున్నదనునది యేది |
| ౧౧౪ | ౧౪ | చెప్పఁబడినవి? | చెప్పఁబడినవి. |
| ౧౧౫ | ౨౧ | న ఁజెప్పఁబడు | నని చెప్పఁబడు |
| ౧౧౮ | ౯ | దానిని గాఁయపుడు | దానిని గానెపుడు |
| ,, | ,, | జూచుచున్నాఁడోఁ | జూచుచున్నాఁడో |
| ౧౧౯ | ౯ | యాత్మ, సాక్షి... | యాత్మసాక్షి స్థాం |
| ౧౨౯ | ౪ | జూచుచున్నాఁడు | జూచుచున్నారు |
| ౧౩౭ | ౧౭ | దానమును | దానములును |
| ౧౩౯ | ౧౮ | ఛేయ | జేయ |
| ౧౪౦ | ౨౦ | బడుచున్నఁది | బడుచున్నది. |
| ౧౪౫ | ౧౧ | బడుచున్నది | బడుచున్నవి. |

సర్వశాస్త్ర శిరోరత్నంబగు వేదాంతశాస్త్ర మందలి భగవద్గీతాదిగ్రంథంబులు గీర్వాణంబున నుండుటంజేసి సర్వజన సుబోధంబులు గానందున వేందాంత విషయకజ్ఞానంబు దుర్ఘటంబనివచించు వారిననేకులఁగాంచి ప్రస్తుతము సర్వజనోపకార మగు శ్రీభగవద్గీతాభాష్య వ్యాఖ్యానాదుల నాలోకించి ఆంధ్రింబున వచనరూపముగా శ్లోకముల యొక్క సరియైన తాత్పర్యమును వ్రాసినాఁడను. ఏతద్గ్రంథావలోకనంబునంగలుగు విశేషంబులు శ్రీమత్పరమహంస పరివ్రాజకులగు శంకాచార్యులవారి శిష్యులే *భగవద్గీతాకిఞ్చిదధితా।గంగాజలలవకణికాపీతా। సకృదపియేనమురారిసమర్చా। క్రియతేతస్యయమోపినచర్చా *గేయంగీతానామసహస్రం। ధ్యేయంశ్రీపతిరూపమజస్రం। నేయంసజ్జనసంగతమనిశం। దేయందీనజనాయచవిత్తం* అనిచెప్పియున్నారు. మఱియును. *మలనిర్మోచనంపుంసాం। జలస్నానందినేదినే। సకృత్గీతాంభసస్నానం। సంసారమలమోచనం *ఇత్యాదిప్రమాణములచే నీగీతాశాస్త్రము శ్రేష్ఠమయినదని చెప్పనక్కఱలేదు. ఈగ్రంథమునుఆమూలాగ్రముసరిచూచిసవరించినందున, బ్రంహ్మశ్రీ*వేదం. వెంకటాద్రియ శాస్త్రిలవారికిని, సోమయాజుల. వెంకటశివయ్య శాస్త్రిలవారికిని, నమస్కరించుచున్నాఁడను.మఱియు నీగ్రంథంబున ప్రామాదికంబులుండెనేని తెలియఁజేసిన రెండవకూర్పునందు సవరించుచున్నాఁడను.

ఓమ్.

శ్రీరస్తు.

# శ్రీభగవద్గీతా వచనము.

## మొదటి యధ్యాయము.

## అర్జునవిషాదయోగము.

### ధృతరాష్ట్రునివాక్యము.

ఓసంజయ! పుణ్యక్షేత్రంబగు కురుక్షేత్రంబునందు. నాకొమారులగు దుర్యోధనాదులును, పాండురాజు పుత్రులగు ధర్మరాజాదులును యుద్ధము సేయ సమకట్టి కూడి యున్నవారలై ఏమి సేసిరి?

### సంజయునివాక్యము.

ఓధృతరాష్ట్ర! రాజగు దుర్యోధనుండు వ్యూహాకారముగా రచింపంబడిన పాండవ సైన్యంబును జూచి ద్రోణాచార్యుల సమీపమును

బొందియుట్లనియె. ఓకుంభజ! తమ శిష్యుండును, బుద్ధిమంతుండును, ద్రుపదరాజు కుమారుండునైన ధృష్టద్యుమ్నునిచే వ్యూహాకారంబుగా రచింపం బడిన యధికమగు పాండవ సైన్యమును జూడుము. దీనియందు మంచిజయశీలురగు విండ్లుగలవారును యుద్ధరంగమునందు భీమార్జునులకు సములైన వీరులును గలరు. వారలెవ్వరనిన, సాత్యకియు, విరాటుండును, మహారథికులగు ద్రుపదుండును, దృష్టకేతుండును, చేకితానుండును, పరాక్రమశాలియగు కాశీరాజును, పురుజిత్తుండును, కుంతిభోజుండును, నరశ్రేష్ఠుండగు శైబ్యుండును, వీరుండగు యుధామన్యుండును, పరాక్రమవంతుండగు నుత్తమౌజుండును, సుభద్ర కుమారుండును, ఉపపాండవులును, వీరలందఱు మహారథికులగుచున్నారు. ఓ బ్రాహ్మణోత్తమ! నా సేనకు రక్షకులయినవారలను తమకు లెస్సగాఁ దెలియుటకుఁ జెప్పుచున్నాను వినుము. మన సంబంధులగు వారలలో శౌర్యముచే శ్రేష్ఠులగువారిని దెలియుము. అట్టివారెవరనిన, నీవును, భీష్ముండును, కర్ణుండును, సోమదత్తుని కుమారుండగు భూరిశ్రవుండును, నా నిమిత్తమయి ప్రాణములు విడుచుటకిష్టము గలవారనేకులును,వీరునుంగాక, జయద్రథాదులును. వీర

లందఱు శూరులును, అనేక శస్త్ర సాధనములు గలవారును, గావున యుద్ధమునందు నేర్పరులగుదురు. అట్టిపరాక్రమవంతులు మనసైనికులయ్యును, భీష్మునిచే నంతటను రక్షింపఁ బడుచున్నను మనసైన్యము సంపూర్ణము గాకయున్నది, పాండవుల జయింపఁజాలదని తోఁచుచున్నది. పాండవసైన్యమో, భీమునిచే నంతటను రక్షింపఁ బడెనదయి సంపూర్ణముగా నున్నది. మీర లందఱును సమస్త వ్యూహప్రదేశ మార్గములయందుఁ దమకు నిర్ణయింపఁ బడెన యుద్ధభూమి నతిక్రమింపక భీష్ముని నంతటను రక్షింతురుగాక. ఓయి! మేము భీష్ముని రక్షించు నంతటి వారలమా యని యడిగితిరేని, భీష్ముఁడు వెనుకకుఁ దిరుగక యోధులతో యుద్ధము సేయుచుండఁగా వారలు, ఎదుటనిలువఁ జాలక వంచనసేసి పార్శ్వమునకు వచ్చి నొప్పింతురు గావున నట్లు గాకుండునటుల నతనిని రక్షింపవలయును; భీష్ముని రక్షింపంబని యేమనిన, ఆయన యొక్క-బలముచేతనే మనము సజీవులమయియున్నాము.

ధృతరాష్ట్రుని వాక్యము,

ఇట్లు సన్మాన పురస్సరమయిన దుర్యోధనుని వాక్యమునాకర్ణించి, భీష్ముండేమి చేసెను?

## సంజయునివాక్యము.

ఓ ధృతరాష్ట్రా! పరాక్రమశాలియగు కురుశ్రేష్ఠుండైన భీష్ముండు, అట్లుస్తోత్రముసేయు దుర్యోధనునికి సంతోషమును బుట్టించుచు, గట్టిగా సింహనాదము సేసి శంఖము పూరించెను. ఆ సేనానాయకుండయిన భీష్మునిచేఁ జేయంబడిన సింహనాద శంఖధ్వానానంతరమునందు, కౌరవ సైనికులచే శంఖములును, భేరులును, పణవములును, ఆనకములును, శీఘ్రముగా మ్రోయింపఁబడెను, అట్టి వాద్యములవలనం బుట్టిన శబ్దము సంకులమాయెను. ఆవాద్యధ్వానానంతరమునందుఁ జెల్లని గుఱ్ఱములతోఁ గూడినదియు, మేలైనదియు నయిన రథమునందున్న శ్రీకృష్ణార్జునులును, బ్రకాశించుచున్న శంఖములను లెస్సగాఁ బూరించిరి. ఆపూరించిన క్రమమును విభజించి చెప్పుచున్నాను వినుము. శ్రీకృష్ణుండు పాంచజన్యమును, అర్జునుండు దేవదత్తమును, భీకర కృత్యములంజేయు భీముండుపౌండ్రమును, ధర్మరాజనంతవిజయమును బూరించిరి; నకుల సహదేవులు సుఘోషమణిపుష్పకములను క్రమముగాఁ బూరించిరి; ఇదియునుంగాక, మేలగు ధనస్సుగల కాశీరాజును,

మహారథికుండగు శిఖండియు, ధృష్టద్యుమ్నుండును, విరాటుండును, యుద్ధమునందు జయింపం బడని సాత్యకియును, వీరలు వేర్వేఱుగా శంఖంబులం బూరించిరి. ఓధృతరాష్ట్రా! ద్రుపదరాజును, ద్రౌపది పుత్రులగు నుపపాండవులును, మిగుల భుజబలము గల యభిమన్యుండును, ఈ యోధాగ్రేసరు లంద ఱును శంఖములను వేర్వేఱుగాఁ బూరించిరి. సంకుల మగు శ్రీకృష్ణార్జునుల శంఖారవములు భూమ్యా కాశంబుల ప్రతిధ్వనులచే నిండింపుచు నీసంబంధు లగు దుర్యోధనాదుల మనస్సులను భేదించెను. ఓయి ధృతరాష్ట్రా! ఈ యుభయ సైనికులు శంఖార వము సేసిన పిమ్మట బాణములు తెస్సగాఁ బడు చుండఁగా, హనుమద్ధ్వజుండగు నర్జునుండు, యుద్ధము సేయ సమకట్టియున్న నీ కుమారులగు దుర్యోధనాదులను జూచి విల్లెక్కువెట్టెను.

## అర్జునునివాక్యము.

ఓదేవా! తొలుత నేనెవరితో యుద్ధము సేయఁ దగును? తన్నిమిత్తమయి, నేను, యుద్ధము సేయ నిశ్చయించిన వారలగు నీ దుర్యోధనాదులను జూడఁ గల మేరలోపల ఉభయసేనల మధ్యము

నందు నారథము నుంపుము. దుష్టబుద్ధియగు దుర్యోధనునికి యుద్ధమునందు సాహాయ్యము సేయుటకై ఈ యుద్ధ రంగమునకు వచ్చిన వీరులలో నేను యుద్ధము సేయఁదగిన శూరులను జూచెదను, గావున, ఉభయ సేనా మధ్యమునందు రథమును నిలుపుము.

సంజయునివాక్యము.

౧

ఓధృతరాష్ట్రా! పార్థునిచేఁ గోరంబడి నటుల శ్రీకృష్ణుం డుభయసేనల మధ్యమునందు శ్రేష్ఠంబగు రథమును భీష్మద్రోణాచార్యులెదుటను, సమస్త రాజుల యెదుటను నిలిపెను.

శ్రీభగవద్వాక్యము.

ఓయర్జున! యుద్ధార్థమై గూడియున్న యీ కౌరవసైనికులను జూడుము.

సంజయునివాక్యము.

అర్జునుండు శ్రీకృష్ణుని వాక్యంబు విని, ఆకౌరు సేనయందున్న పినతండ్రుల్ను, పెత్తండ్రులగు భూరి

శ్రవః ప్రభృతులను, తాతలయిన భీష్మాదులను, గురువులయిన ద్రోణాదులను, మేనమామలయిన శల్యాదులను, అన్నదమ్ములయిన దుర్యోధ నాదులను, వారికుమారులయిన లక్ష్మణాదులను, వారి మనుమలను, మిత్రులయిన కృతవర్మాదులను, పడుచుల నిచ్చిన మామలను, ఉపకారము సేసిన వారలను జూచెను, ఇట్టివారలను జూచుటయేకాక నుభయ సేనలయందు నిట్టిచుట్టములను యుద్ధరంగమునందుఁ జూచి శ్రేష్ఠమగు దయతోఁ గూడిన వాఁడై దుఃఖించెను.

## అర్జునునివాక్యము.

ఓ కేశవ! యుద్ధము సేయ నిశ్చయించి, సమీపించియున్న యీచుట్టములను జూచి నాయవయవములు శిథిలమగు చున్నవి: నా నోరెండుచున్నది: దేహమునందువణఁకును, రోమముల గగురు పాటును బుట్టుచున్నవి. నాగాండీవము చేతినుండి జాఱుచున్నది: నాచర్మమంతటను దహింపఁబడుచున్నది: నామనస్సును జంచలమయిన దానివలెనున్నది. కావున రథము మీఁద నుండుటకు సమర్థుండను గాను. ఓవాసుదేవ! అనర్థక సూచకములయిన శకునములనుజూచు

చున్నాను. యుద్ధమునందు బంధుజనమును జంపిన పిమ్మట సుఖమును బొడనోపను. ఓమధుసూదన! నేను గెలుపును గోరను, రాజ్యమును, సుఖములను గోరను. ఓగోవింద! ద్రోణాదుల ప్రయోజన నిమిత్తమయిమనచేత రాజ్యమును బ్రక్క్పందన వని తాది భోగములును గోరఁబడెను. అట్టిద్రోణాదు లో, ధనప్రాణములు విడిచి యుద్ధమునందున్నవా రు; కావున, రాజ్యముచేతను, సుఖములచేతను, తుదకు బ్రతుకుట చేతను మనకేమిప్రయోజనము గలుగుచున్నది? ఆచార్యులును, తండ్రులును, కుమా రులును, తాతలును, మేనమామలును, మామలును, మనుమలును, పెండ్లాముతోఁబుట్టినవారలును, సంబం ధులును, మమ్మును సంహరించువారలయినను, ఈదుర్యోధనాదులను త్రైలోక్యప్రాప్తికలిగినను, నేను సంహరింప గోరను. అట్లుండ, నేను ఈభూమికయి ఎట్లు సంహరించుటకు నోపుదు ను. ఓజనార్దన! దుర్యోధనాదులఁ జంపిన మనకేమి సంతోషము గలుగును? ఆతతాయులయినను, ఈదు ర్యోధనాదులఁ జంపినమనలనుదోషమే పొందును. కావున, ఓకేశవ! బంధుజనమును జంపి యెట్లుసుఖ ము గలవారలగుదుము? కావున బంధుసహితులగు దుర్యోధనాదులను మనము చంపుటకు నర్హులము

గాము. రాజ్యలోభముచేఁ బీడింపఁబడిన మనస్సు గల దుర్యోధనాదులు కులక్షయముచేఁ జేయంబడుదోషంబును, మిత్రద్రోహమందలి పాతకంబును నెట్టి విధముచేతనయినను గానరు- ఓమధుసూదన! కులక్షయముచే దోషమును వీక్షించుచున్న మనచే నీపాపము నివర్తించుట కెట్లు దెలియఁదగినది గాదు. వంశక్షయము గలుగుచుండఁగా, ప్రాచీనములగు వంశాచారములు నశించుచున్నవి. ఆచారము నశించుచుండఁగా వంశమంతయు ననాచారమును దృఢముగాఁ బొందుచున్నది. ఓకేశవ! అనాచారముగలుగుటవలన కులస్త్రీలు చెడి పోవుచున్నారు- ఓయచ్యుత! స్త్రీలు స్వాచారభ్రష్టలగుచుండఁగావర్ణసంకరము గలుగుచున్నది. వంశముచెఱచినవారలకును, సంకీర్ణ వర్ణమునకును, వర్ణసంకరము నరకమునే కలుగఁ జేయుచున్నది. సంకీర్ణము గలవారి పితృదేవతలు పిండోదక కార్యములు లేనివారలయి యధోలోకమునం బడుచున్నారు. ఈ బ్రాహ్మణాది వర్ణములకలియుటను జేయునట్టి కులమునుజెఱచినవారిదోషములచే శాశ్వతములగు జాతి ధర్మములు పోఁగొట్టఁబడుచున్నవి. వంశాచారములు విడనాడిన వారికి నరకమునందు సదా నివాసము గలుగునని విందుము. రాజ్య

సుఖముల లోభముచే స్వజనమును - సంహరించుట కొఱకు మనము యత్నించితిమి, కావున మహాపాపము సేయుటకు నుద్యుక్తుల మయితిమి. కట కట! ఎంతయాశ్చర్యము! శస్త్రవర్జితుండనయి ప్రతిక్రియలేనట్టి నన్నుయుద్ధమునందు నాయుధ హస్తులగు ధార్తరాష్ట్రాదులు సంహరించినను నాకు మిగుల సహింపఁ దగినదగును,

సంజయునివాక్యము,

ఇట్లర్జునుండుపలికి దుఃఖించెను. మఱియు ను జలించిన మనస్సు గలవాఁడగుచు బాణముతోఁ గూడిన ధనుస్సునువదలి యుద్ధరంగమునందు రథము మీఁదఁ గూర్చుండెను.

ఇది శ్రీభగవద్గీతా వచనంబను యోగశాస్త్రంబున శ్రీకృష్ణార్జున సంవాదంబునందు నర్జున విషాద యోగముమొదటియధ్యాయము.



రెండవయధ్యాయము.

సాంఖ్యయోగము.

సంజయునివాక్యము.

వ్యాకుల చిత్తుండును, దయతోఁ గూడినవాఁడును, కన్నీటిచే నిండిన నేత్రములు గలవాఁడు నగు నర్జునునితో శ్రీకృష్ణుండిట్లనియె.

శ్రీభగవద్వాక్యము.

సంకటకాలంబునం బామరులచేఁ బొందంబడినదియు, స్వర్గంబున కనర్హంబయినదియు, అపకీర్తికరంబయిన యీ మోహమేలనిన్నుఁ బొందెను. ఓయర్జున! భయమును జెందకుము. నీయందిట్టి మోహముపుట్టుట తగదు. తుచ్ఛమగు నట్టియధైర్యమునువిడిచి యుద్ధమునకు లేలెమ్ము.

అర్జునునివాక్యము.

శత్రుసంహారకుండవగు నోకేశవ! పూజ్యులగు భీష్మద్రోణులతో, యుద్ధరంగమునందు, బాణములచే నేనెటుల నెదిరించి యుద్ధము సేయుదును. మహానుభావులగు ద్రోణాది గురువులను సంహరింపక, ఈ లోకమునందు భిక్షాన్నమునయినను భుజిం

చుటశ్రేష్ఠము. ద్రవ్యకాముల౦డు ద్రోణాదులను సం
హరించిన నీలోకమునందు రక్తముచే బూయుం
బడు భోగముల ననుభవించెదను. ఇంతియకాదు,మ
నము దుర్యోధనాదులను జయింపఁ గలమో లేమో?
వారు, మనలను జయింతురేమో? ఈ రెంటియందు
గురుతరమైన, జయాపజయ రూపకార్యము నెఱుం
గము. అభిముఖమందున్న యీధార్తరాష్ట్రాదులను
సంహరించినవెనుక జీవింప నిశ్చయింపను. కార్ప
ణ్యాంబనెడి దోషంబుచేఁ దిరస్కరింపఁ బడినకార్య
లక్షణముగల నేను న్యాయమందు జ్ఞానములేని మన
స్సుగలవాఁడనగుచు నిన్నడుగుచున్నాను. నీవు నాకు
శ్రేయమగుదానిని నిర్ణయించి చెప్పుము: నేను
నీకు శిష్యుండను: నిన్నుశరణు చొచ్చితిని గావున
శిక్షింపుము. ఇంద్రియములకు మిగుల శోషము గలు
గఁజేయు నా వ్యసనమును బోఁగొట్టు కార్యమును,
భూమియందు నిష్కంటకమును సమృద్ధమునగు రా
జ్యంబును దేవతల యింద్రత్వంబును నేను పొంది
యును, గానను గదా.

ధృతరాష్ట్రునివాక్యము.

పిమ్మట ఏమి జరిగెను.

సంజయుని వాక్యము.

ఓయిధృతరాష్ట్ర! శత్రుసంహారకుండగు నర్జు

మందు శ్రీకృష్ణునితో నిట్లుపలికి యుద్ధము సేయనని మరల చెప్పి యూరకుండెను. ఓ ధృతరాష్ట్రా! ఉభయ సేనలమధ్యమునందు దుఃఖించుచున్న అర్జునునికి శ్రీకృష్ణస్వామి హాస్యముసేయువానివలె నిట్లుపలికెను.

## శ్రీభగవద్వాక్యము.

ఓయర్జున! దుఃఖింపందగని భీష్మాదులఁ గూర్చి వ్యసనపడి పండిత వచనములు పలుకుచున్నావు. అయినను నీవు పండితుండవు గావు. ఏలయనఁగా, ఆత్మానాత్మ వివేకజ్ఞులగుఁ బండితులు చచ్చినవారలకును, బ్రతికియుండు వారలకును దుఃఖింపరు. సర్వేశ్వరుండగు నేనొకానొకప్పుడును లేకపోయిన వాఁడనుగాను, సదా అవినాశినై యున్నాను. నీవును లేకపోయిన వాఁడవుగావు. ఈరాజులును లేక పోయినవారలుగారు. మనమందఱము, ఈ దేహము నశించిన పిదప లేకపోఁగల వారముగాము. ఈ దేహమునశించినను, ఆత్మస్వరూపముచే నిత్యులమై యున్నాము. దేహముగల యాత్మకు ఈస్థూల దేహమునందు, బాల్యయౌవ్వన జరావస్థలు సహజ

మగునటుల మఱియొక దేహముపొందుట సహజము. కావున, దేహమునకు అవస్థా భేదములును నాశన మునుగలుగును గాని ఆత్మకుఁ గలుగవు. ప్రాజ్ఞుండు ఆదేహనాశోత్పత్తి విషయమై మోహమునొందఁడు. ఓయర్జున! పంచతన్మాత్రముల వలనంబుట్టిన శ్రోత్రాదీంద్రియముల శబ్దాది విషయ సంయోగముల యందు శీతోష్ణాదులగు సుఖదుఃఖములఁ గలుగఁ జేయునట్టిసంయోగ వియోగములు గలిగినవియు, అస్థిరములయినవియుఁ గావున నోయర్జున! అట్టి శీతోష్ణాదుల నోర్చుకొనుము. ఓయర్జున! ఈమాత్రాస్పర్శములు సమదుఃఖసుఖములు గలిగిననిశ్చలుని బాధింపవు. అట్టిపురుషుఁడు మోక్షమునకై సమర్థుండగుచున్నాఁడు. నశించెడు దేహమునకు నుండుటలేదు. నిత్యుఁడైనయాత్మకు లేకపోవుట లేదు. పరబ్రహ్మమనెడి వస్తువును దెలిసిన వారిచే రెండగు సదసత్తులైన యాత్మ దేహముల నిర్ణయము చూడఁబడెను. ఈజగత్తునందంతటను వ్యాపించిన యావిష్ణ్వాఖ్య బ్రహ్మను నాశములేనిదిగాఁ దెలిసికొనుము. ఎవఁడును శాశ్వతమైన యాత్మనునాశముసేయఁ జాలఁడు. ఎల్లప్పుడు నేక రూపమైనదియు, నాశనములేనిదియు, ప్రత్యక్షాది

ప్రమాణములకు నగోచరమైనదియు నగు నాత్మకు ఈశరీరములు నాశముగలిగినవని తత్త్వజ్ఞులచేఁ జెప్పఁబడెను. కావున, ఓయర్జున! యుద్ధము సేయుము. ఈ యాత్మను చంపెడి వానినిగాను, చచ్చు వానినిగాను దెలియుచున్న వీరిరువురును దెలిసిన వారలుగారు. ఈయాత్మ చంపఁడు, చంపఁబడఁడు. ఈయాత్మ పుట్టువు లేనివాఁడును, ఎల్లప్పుడు నుండెడి వాఁడును, స్థిరరూపుండును అనాదియైన వాఁడునగుచున్నాఁడు. ఈయాత్మ యెకప్పుడును బుట్టఁడుమృతినొందఁడు. ఈయాత్మపుట్టిమరలఁగాఁ గలవాఁడును గాఁడు. కావున, శరీరము సంహరింపఁబడుచుండగానీయాత్మచంపఁబడఁడు; కావున, జాయతె, అస్తి, వర్ధతె, విపరిణమ్యతే, అపక్షీయ్యతె, నశ్యతి యనెడి షడ్వికారములు పరమాత్మకులేవు. ఈ యాత్మను ఏకరూపునిగాను అస్త్యభావ వికారరహితునిగాను బుట్టువులేనివానిని గాను, క్షయరహితునిగాను నెఱుంగునట్టి యా పురుషుఁడెవ్వని నెట్లుచంపుచున్నాఁడు, చంపించుచున్నాఁడు. మానవుఁడు శిథిలములగు వస్త్రములను విడిచి యితర నూతన వస్త్రములను ధరించు విధంబున, ఆత్మశిథిలమగు దేహమునువిడిచి యితర

ములగు నూతనదేహములను బొందుచున్నాఁడు. ఈయాత్మను ఆయుధములు ఛేదింపవు; అగ్నిదహింపదు, ఉదకములుతడపవు, వాయువెండింపదు. ఈ యాత్మ ఛేదింపందగినవాఁడును, దహింపదగిన వాఁడును, దడపఁదగినవాఁడును, ఎండింపఁదగిన వాఁడునుగాఁడు, ఈ యాత్మ నాశరహితుండును, సర్వవ్యాపకుండును, స్థిరస్వభావుండును, చలింపనివాఁడును, పురాతనుండునగుచున్నాఁడు. మఱియు నీయాత్మ చక్షురాదుల కగోచరుండును, కర్మేంద్రియములకు, విషయముగాని వాఁడని జెప్పఁబడుచున్నాఁడు. కావున, ఈ యాత్మను యిట్లెఱిఁగి దుఃఖించుటదగదు. అయినను, నిత్యమునుబుట్టుచు, నశించుచునున్న దేహమును ఈ యాత్మనుగా నీవు తలంచినను ఇట్లుదుఃఖించుటదగదు. పుట్టినవానికి నాశము నిశ్చయము; చచ్చిన వానికిఁ బుట్టుకయు నిశ్చయము. కావున, తప్పింపఁ గూడనిగార్య విషయమై పండితుండవగు నీవు దుఃఖించుట దగదు. ఓయర్జున! శరీరములు, ప్రధానతత్త్వమే స్వరూపములుగాఁ గలవియు, గోచరములగు జన్మమరణాదులే మధ్యకాలమునందుఁ గలవియు, ప్రధానతత్త్వమునం దే లయము బొందునవియు నగును. అట్టిశరీరములవిషయమై ఏలదుఃఖించెదవు? ఒకానొక్కఁడు ఈయాత్మ

ను ఆశ్చర్యమగు వస్తువును జూచునటుల వీక్షించు చున్నాఁడు. అలాగుననే మఱియొకఁడీ యాత్మనా శ్చర్యమువలె మఱియొకనితోఁ జెప్పుచున్నాఁడు. ఇతరుఁడీ యాత్మను ఆశ్చర్యమువలెవినుచున్నాఁడు. మఱియొకఁడీ యాత్మను కని విని పిలిచియు నెఱుంగఁడు. ఓయర్జున! సమస్తమైన సురాసురమను ష్యాదిప్రాణిసమూహముల శరీరములుసంహరింపఁ బడుచున్నను, ఈయాత్మ యెప్పుడును జంపఁదగని దాఁడగును. కావున, నీవు ఈభీష్మాది శరీరములను గూర్చి దుఃఖించుటదగదు. ఇంతయేకాదు, క్షత్రియ ధర్మమును విచారించి, చలింపఁదగదనునది యుక్తమేకదా? రాజులకు ధర్మముతోఁ గూడిన యుద్ధమునకంటె నితరమైనశ్రేయస్సులేదు. ఓ యర్జున! అపరణరహితమైనదియు, స్వర్గద్వార భూతమైనదియు, అప్రార్థనచేఁ బ్రాప్తంబయినదియు నగు నిట్టియుద్ధమును బొందుచున్నవారలు భాగ్యవంతులు. నీవుస్వధర్మయుక్తమయిన యీయుద్ధము సేయవేని స్వధర్మఫలమును,కీర్తియును,విడిచి పాపమును బొందఁగలవు. ఇంతియకాదు, ప్రాణులు శాశ్వతమైన నీయపకీర్తినిఁ జెప్పుకొనఁ గలరను నది యుక్తమేగదా? శౌర్యధైర్యాది గుణములచే

సన్మానింపఁబడిన వానికి నిట్టి యపకీర్తి చావుకంటె నధికమగుచున్నది; నీశౌర్యధైర్యాది గుణములకయి యింతవఱకు నిన్ను బహుమానించుచున్న మహారథికులగు దుర్యోధనాదులు, నీవు భయమువలన, యుద్ధమునుండి నివృత్తిఁబొందితివని దలంపఁగలరు. పూర్వమందు, బహుమానము సేయఁ బడినవాఁడవై యటువెనక చులకఁదనమును బొందగలవు. నీసామర్థ్యమును దూషించుచున్న నీశత్రువులగు ధార్తరాష్ట్రులు పలుకరాని పలుకులను పలు విధములుగా వాడుకొనఁగలరు. అంతకంటెను దుఃఖమేమియున్నది. ఓయర్జున! యుద్ధమునందు శత్రువులచేఁ జంపఁబడినవాఁడవైతివేని స్వర్గమును బొందగలవు: జయించినవాఁడవైతివేని, భూజాతభోగంబుల ననుభవింపఁగలవు. కావునయుద్ధమునకు జేరిన శత్రువులను జయింతునను నిశ్చయముగలవాఁడవై లెమ్ము. సుఖదుఃఖములు సమానములుగా నెంచి వానివలనఁ గలిగెడు లాభాలాభములను, జయాపజయములను, సమములుగాఁ జేసి, అటువెనుక యుద్ధమున కాయత్తుండవుకమ్ము. ఇట్లుయుద్ధము సేసితివేని పాపమును బొందవు. దానికి సాధనభూతమగు కర్మయోగమును వినుము.

ఓయర్జున! ఆత్మతత్త్వమందు ప్రతిపాదింపఁ బడిన యీ బుద్ధి నీకుఁ జెప్పఁబడెను: యోగమునందో, ఇట్టి బుద్ధిని వినుము. దీనితోఁగూడిన వాఁడవయితివేని కర్మానుబంధమును విడువంగలవు. ఈ కర్మయోగమునందు నారంభనాశము లేదు: ప్రత్యవాయమును లేదు. ఈయోగము స్వల్పమాత్రమయ్యు నధిక భయమునుండి విముక్తిం జేయఁగలదు; ఓకురునందనా! ఈ విధానమునందు నిశ్చయాత్మక బుద్ధి యేకమయినదిగానున్నది. అయినను, నిశ్చయరహితుల బుద్ధులు సంఖ్యలేనివియును, బహుశాఖలు గలవానివలె ఫలాసక్తులునైయున్నవి. ఓయర్జున! స్వర్గఫలమున కంటెను వేఱైనది యేమియును లేదని వేదవాదరతులయిన వాదశీలురగు పండితులు స్వర్గ ఫల ప్రతిపాద వాక్యములను బుష్పించినలతలవలె రమ్యమైనవిగాఁ జెప్పుచుందురు. కోరికలయందు మనస్సు గలిగి స్వర్గమే ఉత్తమ పురుషార్థముగా నెంచిన వారలు, స్వర్గఫలాంతరమునందు జన్మమును, కర్మఫలమును నిచ్చునట్టిభోగైశ్వర్యములఁ గూర్చిన కార్యవిశేషములు ప్రచురములుగాఁ జేయు వాక్యమును జెప్పుచున్నారు. సుఖప్రభుత్వములందాసక్తలయిన వారును, క్రియావిశేష బహుళమైన పుష్పి

త వాక్యములచే నపహరింపఁబడిన చిత్తముగల వారునునగు మానవులకు సమాధియందు నిశ్చయాత్మక బుద్ధి విధింపఁబడదు. ఓయర్జున! సత్వ రజస్తమోగుణ విశిష్టు లగుమానవులకు వేదములు తదనురూప ఫలములను గలుగఁజేయును, గావున శీతోష్ణాది సుఖదుఃఖరహితుఁడవును, శాశ్వత సత్వ గుణ విశిష్టుండవును, యోగక్షేమరహితుండవును, ఆత్మజ్ఞానము గలవాఁడవును, త్రిగుణాతీతుండవును కమ్ము. నూతియందుఁ గలుగు నంతటి ప్రయోజన మంతటను నిండయుండు నుదకముగల మడుగునం దును గలుగుచున్నది; కావున సమస్తవేదముల యందుఁ గలుగునంతటి ప్రయోజనము జ్ఞానియైన బ్రాహ్మణునికే గలుగుచున్నది. నీకునిత్యనైమిత్తి కాది కర్మమునందే, యధికారము గలుగునుగాక; కర్మఫలముల యందలికోరిక, ఒకప్పుడును, లేక యుండునుగాక. నీవు కర్మఫలమునకుఁ గారణమైన వాఁడవుగాకయుండుము. నీకు అకర్మమునందును సంగమములేక పోవునుగాక. ఓయర్జున! ప్రాప్తా ప్రాప్తములయందు మనస్సును సమముగా నుం డుట యోగమని చెప్పఁబడుచున్నది. యోగమం దున్నవాఁడవై జయాపజయములందు సమానుఁడవై

ఆసక్తినివిడిచి, యుద్ధాదికర్మము సేయుము. ఓ యర్జున! నిష్కామ మనోబుద్ధియుక్త కర్మమున కంటెను గామ్యకర్మము, దూరముగుటచే, నికృష్ట మైనది. కామ్యఫలములే కారణములుగాఁ గలవారలు నికృష్టులైన సంసారులు గావున, జ్ఞానవిషయమై కర్మమును బ్రార్థింపుము. ప్రాప్త్యప్రాప్తులయందు సమబుద్ధితోఁ గూడినవాఁడు ఈలోకమునందుఁ బుణ్యపాపముల రెండింటిని ద్యజించుచున్నాడు. ఆకారణమువలన, బుద్ధి యోగముతో యుక్తుండవగుము; అదియుక్తమే గదా? ప్రాప్త్యప్రాప్తులయందు సమమైన బుద్ధియే, కర్మములయందుఁ గుశలత్వము, మోక్షవిషయ బుద్ధితోఁగూడిన ఆత్మానాత్మ వివేకజ్ఞులు, కర్మములవలనఁ బుట్టిన ఫలమును విడిచి జన్మమనెడి బంధమువలన విడువఁబడినవారై సర్వోపద్రవరహితమైన స్థానమును బొందుచున్నారుగదా? నీబుద్ధి, దేహాభిమానరూప కాలుష్యమును దాఁటఁగలిగినపుడు విన దగినయర్థమునకును విన్నయర్థమునకును వైరాగ్యమును బొందఁగలవు. ఇంతకుముందుఁ జలింపఁజేయఁబడిన నీబుద్ధి వేదాంతశ్రవణముచేఁ జలింపనిదై సమాధియందుస్థిరముగ నుండఁగలిగినపుడు యోగమును బొందగలవు.

### అర్జునుని వాక్యము.

ఓ కేశవ! ఈసమాధియందున్న బ్రహ్మైవాహమస్మి యనెడినిశ్చలబుద్ధిగలపురుషునికి వాచకలక్షణ మెద్ది? బ్రహ్మమునందు నిశ్చలబుద్ధిగల పురుషుఁడు ఏమిపలుకును? ఎట్లుకూర్చుండును? ఎట్లునడచును?

### శ్రీభగవద్వాక్యము.

ఓయర్జున! ఎప్పుడును, ప్రత్యగాత్మస్వరూపమునందే యానందించుచున్నవాఁడై సమస్త తుచ్ఛమనోరథములను విడిచినవాఁడు నిశ్చలమయిన ప్రజ్ఞ గలవాఁడని చెప్పఁబడుచున్నాఁడు. ఆధ్యాత్మికాది దుఃఖములు గలుగుచుండఁగా భయపడనిమనస్సు గలవాఁడును, సుఖములయందు నాశలేనివాఁడును, రాగభయక్రోధములు లేనివాఁడునగుమననశీలుఁడు నిశ్చలబుద్ధిగలవాఁడని చెప్పఁబడుచున్నాఁడు. సకల ప్రయోజనములయందును ఉదాసీనుఁడై స్నేహములేనివాఁడై ఆయాశుభాశుభములను బొందిసంతోషింపని దుఃఖింపని పురుషునిబుద్ధి మిగులస్థిరమయినది. తాఁబేలు తనంతట కరచరణాద్యవయవములు, ముణుచుకొనునటుల, ఈయోగిసర్వవిషయ

ములవలనను శ్రోత్రాదీంద్రియములను ముణుచు
కొనునపుడు అట్టియోగియొక్క బుద్ధిమిగులస్థిరమై
యుండును ఇంద్రియములచే నింద్రియార్థ గ్రహ
ణము సేయుచు, దేహాభిమానముగలిగి నిరా
హారియై తపస్సుసేసెడి యజ్ఞుని ఇంద్రియములు
అభిలాషవినాగా తక్కినవానిని వదలుచున్నవి. పర
మాత్మనుబాచిన ఈస్థితప్రజ్ఞునికి నభిలాషయును
నివర్తింపుచున్నది. ఓయర్జున! బలవంతములయిన
ఇంద్రియములు, బ్రహ్మప్రాప్తికొఱకు యత్నము
సేయుచున్న వివేకియగు పురుషుని మనస్సునుబలా
త్కారముగా నాకర్షించుచున్నవిగదా? యోగి
సకలేంద్రియంబులను సంగ్రహించి నాయందా
సక్తుండైనవాఁడైయుండును. ఇంద్రియములను వశ
పఱచికొన్న యాపురుషునిబుద్ధి బ్రహ్మమందుస్థిర
మైయున్నది. విషయములను జింతించుచున్న పురు
షునికే నావిషయములందాసక్తి పుట్టుచున్నది. ఆ
విషయాసక్తివలనఁ గోరికపుట్టుచున్నది. కోరిక
వలనఁ గ్రోధము పుట్టుచున్నది. క్రోధమువలన
వివేకము శూన్యమగుచున్నది. వివేకశూన్యతవ
లన గురూపదిష్టమార్గభ్రంశనమగుచున్నది. బుద్ధి
నాశమువలన మనుజుఁడు మిక్కిలి చెడిపోవుచు

న్నాఁడు. రాగద్వేషములను నీకెంటి చే విడువఁబడినవాఁడుగనుక నే మనస్స్వాధీనము లైన యింద్రియములచే, నింద్రియవిషయముల ననుభవించుచున్నవాఁడైనను, స్వాధీనమైన మనస్సుగల పురుషుఁడు నిర్మలత్వమును బొందుచున్నాఁడు. ఇట్టి యోగికి నైర్మల్యముగలుగుచుండఁగా సమస్తదుఃఖములకు నాశనముగలుగుచున్నది. స్వచ్ఛమైనమనస్సుగల పురుషునికి అతిశీఘ్రముగా నిశ్చయాత్మకబుద్ధి స్థిరముగా నిలుచుచున్నది. ఇంద్రియనిగ్రహము లేని వానికి నాత్మవిషయబుద్ధియు, నాత్మస్వరూపాభినివేశమును లేవు; బ్రహ్మభావన సేయనిమనుజునికిని చిత్తోపరతి లేదు; చిత్తోపరతి లేనివానికి బ్రహ్మానంద సుఖమెక్కడిది? ఇంద్రియములు విషయములందు సంచరించుచుండఁగాఁబురుషుని చేనియమింపఁబడక అనువర్తింపఁబడుచున్నమనస్సు ఆపురుషుని ఆత్మానాత్మవివేకమును ఉదకమందు నావను బ్రతికూలవాయువు వలెనే హరించుచున్నది గదా? ఓయర్జున! ఆకారణంబున, ఎవనియింద్రియము లంతటను విషయముల వలన నాకర్షింపఁబడుచున్నవో, ఆపురుషునిబుద్ధి మిగులస్థిరంబై యుండును. బుద్ధిరహితులైన సర్వప్రాణులకును ఆత్మవిషయమైన బుద్ధి గోచరము

గాక పోవుటవలన రాత్రివలె నప్రకాశమగుచున్నది. అట్టి యాత్మవిషయమైన బుద్ధియందు నింద్రియ నిగ్రహముగల స్థితప్రజ్ఞుఁడగుఁ బురుషుఁడు * మేలుకొనియుండును. ఏశబ్దాది విషయములు గలిగినబుద్ధియందుసమస్త ప్రాణులును మేలుకొనియున్నవో అట్టిశబ్దాది విషయ బుద్ధి ఆత్మావలోకనపరుండైన మననశీలునకు నవిద్యాస్వరూపమగుటవలన రాత్రివలెనే యప్రకాశమగుచున్నది. నదీజలములు, ఉదకములచే నిండింపఁబడినవైనను మర్యాదనతిక్రమింపక నిశ్చలమైయున్న సముద్రుని వికారమును బొందింపకయే ప్రవేశించుచున్నవిధముగా సమస్తకామములు, శబ్దాది విషయసన్నిధానమునందును, వికారము లేకుండు నట్టి పురుషుని వికారమును బొందింపకయే ప్రవేశించి ఆత్మయందే లీనమగుచున్నవి. అట్టిపురుషుఁడు ముక్తుఁడై కేవల బ్రహ్మైక్యమునుబొందుచున్నాఁడు. కామగ్రస్తుఁడైన వాఁడు పొందనేరఁడు. సమస్తకామములనువిడిచినవాఁడును, కాంక్షావిరహితుఁడును, ఆత్మాభిమానములేనివాఁడును, మమతారహితుఁడు

---

* ఆత్మావలోకనముసేయుననుట.

ను, జీవనమాత్రచేష్టశేషము గాఁగలవాఁడును నై సంచరించుచున్న యాపురుషుఁడు మోక్షమును బొందుచున్నాఁడు. ఓయర్జున! ఇది బ్రహ్మమందుఁ బుట్టిననిష్ఠ. ఈబ్రహ్మనిష్ఠను బొంది మోహమును బొందఁడు. ఈ బ్రహ్మనిష్ఠయందంత కాలమునం దైనను నిలిచి మోక్షమును బొందుచున్నాఁడు.

ఇది శ్రీభగవద్గీతా వచనంబను యోగశాస్త్రంబున శ్రీకృష్ణార్జున సంవాదంబునందు సాంఖ్యయోగము రెండవయధ్యాయము.



మూడవయధ్యాయము.

# కర్మయోగము.



## అర్జునునివాక్యము.

ఓ కేశవ! ఓ జనార్దన!! కర్మమూలంబయిన జ్ఞానము కర్మమునకంటెను శ్రేష్ఠంబయినదియును, నీకిష్టంబయినదియు నాయెనేని నన్నేల భయంకరమైన కర్మమునందుఁ బ్రవర్తింపఁ జేయుచున్నావు. మిశ్రితమైన వానివంటివియును సంశయప్రదములునగు వాక్యములచే నాబుద్ధిని మోహింపఁ జేయువానివలెనున్నావు, కావున, నేనుదేనిచే మోక్షమును బొందఁగలనో అట్టిజ్ఞాన కర్మములయందు నొక్కటిని నిర్ణయించిచెప్పుము.

## శ్రీభగవద్వాక్యము.

ఓయర్జున! ముందీలోకమునందు, శాస్త్రార్థము ననుష్ఠించుటయం దధికారముగల జనులకు నాచేఁ

జెప్పఁబడిన జ్ఞానయోగ కర్మయోగముల రెండింటి యందు జ్ఞానయోగము, ఆత్మానాత్మవస్తువివేకము గలిగి జ్ఞానముచే బ్రహ్మచర్యమునుండియే సన్న్యసించి వేదాంత విజ్ఞానముచే నిశ్చితాభిప్రాయము బ్రహ్మమునందే స్థితియును గలిగిన పరమహంసలగుఁ బరివ్రాజకులకును; కర్మయోగము కార్మికులకును; నాచేఁ జెప్పఁబడెను. పురుషుఁడు యజ్ఞాదికర్మములు సేయక పోవుటవలనఁ గ్రియారహితమైననిశ్చయమును బొందఁడు. జ్ఞానరహితసన్న్యాస మాత్రమువలననే నైష్కర్మ్య లక్షణ సిద్ధినిబొందఁ డుగదా! ప్రకృతివలనఁ బుట్టినరాగద్వేషాది గుణములచేఁ బురుషులు అస్వతంత్రులు. ఆకారణము వలన, ఒకానొకఁడు కర్మము సేయనివాఁడై, ఒకానొకయవస్థయందు క్షణమాత్రమైననుండనిది యుక్తమేగదా! వాగాదికర్మేంద్రియముల నిగ్రహించి మనస్సుచే శబ్దాది విషయములను జింతించుచున్న వాఁడు వివేకశూన్యంబయిన మనస్సుగలదబ్బర యాచారము గలవాఁడని చెప్పఁబడుచున్నాఁడు. ఓ యర్జున! జ్ఞానేంద్రియములను మనస్సుచే నిగ్రహించి వాగాదికర్మేంద్రియములచేఁ గర్మయోగమును, ఫలకాంక్షారహితుండై చేయువాఁ డుత్తముండగుచు

న్నాఁడు. ఓయర్జున! నీవు నిత్యమును సంధ్యావం
దనాది కర్మములను జేయుము. కర్మముసేయక
పోవుటకంటెను, కర్మమునందుండుట ఎక్కువయి
నది. కావున, కర్మచేయక పోవుటవలన, శరీర
స్థితియును బ్రసిద్ధినిబొందఁ జాలదు- ఓకౌంతేయ!
భగవద్విషయమైన కర్మమునకంటెను మఱియొక
కర్మమునందుండు నపుడు, ఈజనుఁడు కర్మమేబంధ
ముగాఁ గలవాఁడగుచున్నాఁడు. కావున,ఆయజ్ఞార్థ
మైన కర్మమునే, కర్మఫలాసక్తి లేనివాఁడవై, లెస్స
గాఁజేయుము. పూర్వము, సృష్టికాలమునందు
బ్రహ్మదేవుండు యజ్ఞముతోఁగూడిన ప్రజలను సృ
జించి వారికి నిట్లుసెప్పెను. ఈయజ్ఞముచేఁ బ్రజ
లనుబుట్టింపుఁడు; ఈయజ్ఞము మీకభీష్ట కామము
లను బిదుకునట్టిదౌనుగాక; జనులారా! ఈయోగ
ముచే, నింద్రాది దేవతలను వృద్ధిపొందిపుఁడు;
వారు మిమ్మును, వృద్ధిపొందింతురు. ఇట్లుమీరుపర
స్పరమును వృద్ధి పొందించుకొనువారలై యనంత
రము స్వర్గమునుగాని, ఉత్కృష్టమయిన ముక్తిని
గాని పొందఁగలరు. యాగముచే సంతోషపెట్టఁ
బడినదేవతలు మీకభీష్టములయిన స్త్రీ,పశు, పు
త్రాది భోగముల నిచ్చుచున్నారు. ఆదేవతలచే

నియ్యఁబడిన మృష్టాన్నాది భోగములను, అట్టి దేవతలకొఱకు నియ్యక, తానను భవించువాఁడు చోరుఁడగుచున్నాఁడు. యజ్ఞమువలన శేషించిన యమృతమనెడి యన్నమును భుజించెడి స్వభావముగలసత్పురుషులు సమస్తములయిన పంచ *సూనాది పాపములను బొందరు. దేవతారాధనకొఱకుఁగాక, కేవలము, తమకొఱకు పచనము సేసికొని భుజించువారు పాపమును భక్షించువారగుదురు. అన్నమువలనఁ బ్రాణులును, వర్షాధిదేవతవలన యన్నమును, యజ్ఞమువలన వర్షాధిదేవత యగుపర్జన్యుండును, యజ్ఞము కర్మమువలనను క్రమముగాఁ బుట్టుచున్నది. కర్మము వేదమునుండియే పుట్టినదానిఁగా దెలిసికొనుఁడు. ఆకారణముచేతనే వేదమంతటను వ్యాపించినదై యజ్ఞమునందు సదాయునుపఁబడుచున్నది. ఓపార్థ! ఇట్లుప్రవర్తింపఁ జేయఁబడిన జగచ్చక్రంబు నీలోకమునందు ననువర్తింపనివాఁడు పాపమే యాయువుగాఁ గలవాఁడును, ఇంద్రియములచే విషయా

---

* తరుగునదియు, నూరునదియు, కాల్చునదియు, నీటికి కుంభమందైనదియు, దొడ్డునదియు, ఈదైదును బంచసూనములు.

సక్తుండైనవాఁడును గావున వ్యర్థమగునటుల జీవించుచున్నాఁడు. ఏమానవుండైనను, తనయందే ప్రీతి గలిగి యాత్మచేఁ దృప్తినిఁబొందుచు, ఆత్మయందే సంతోషించుచున్న యాత్మవిదునకుఁ జేయందగు కర్మమేమియును లేదు. అట్టి బ్రహ్మనిష్ఠునకు నీలోకమునందుఁ గర్మము సేసినందునఁ బుణ్యము కలుగనేరదు. ఇట్టి బ్రహ్మవేత్తకు సమస్తభూతములయందును బ్రయోజన నిమిత్తమైన యాశ్రయమొక్కటియును లేదు; ఆ కారణమువలన ఫలసంగవర్జితుండవయి నిత్యమును జేయఁదగిన కర్మమునాచరింపుము. ఫలాసక్తిలేనివాఁడై కర్మముసేయు పురుషుఁడు మోక్షమును బొందఁగలఁడు. జ్ఞానులగు జనకాదిరాజర్షులును కర్మములచేఁ జిత్తశుద్ధినిబొందిరిగదా? నీవుజనుల ప్రయోజనమేచూచునట్టివాఁడవై కర్మముసేయుటకుఁదగుదువు. బ్రహ్మవిదుఁడెట్టి కర్మమునాచరించునో, అట్టికర్మముపామరుఁడగు జనుఁడు నాచరించుచున్నాఁడు. ఆ బ్రహ్మనిష్ఠుఁడెట్టి ప్రమాణము సేయునో, అట్టి మర్యాదను పామరుఁడు ననుసరించుచున్నాఁడు. ఓయర్జున! నాకుఁ జేయందగిన కర్మమేమియును లేదు. మూఁడులోకములయందును నాకుఁబొందఁ

బడనివియును బొందఁదగినవియును లేవు. అయినను గర్మమందున్నాఁడను గదా? నేనొకప్పుడు నప్రమత్తుండనై కర్మమునందుండకపోతినేని మనుష్యులు సర్వప్రకారములుగా నామార్గము ననుసరించుచున్నారు. నేను కర్మము సేయనైతినేని ఈజనులు చెడిపోదురు. వర్ణసంకరమునకుఁ గర్తనగుదును. అందువలన నీప్రజలను జెఱిచినవాఁడ నౌదును. ఓభారత! అనాత్మజ్ఞులు కర్మమందాసక్తి గలవారలై చేయు విధమున, జనుల యున్మార్గ ప్రవర్తనమును నివారింపఁజేయ నిశ్చయించిన యాత్మజ్ఞుఁడు సంగవంతుఁడై కర్మమును జేయవలయును. కర్మమందాసక్తిగల యవివేకియొక్క బుద్ధికిఁ జలనము పండితుండు పుట్టింపఁగూడదు. మఱియేమనిన, సావధానుండును, ఆచరించుచున్నవాఁడునై సమస్త కర్మములనాచరింపఁజేయ వలయును. అహంకార భావముచేఁ దెలియనిమనస్సుగల మనుజుఁడుమాయాజనితమయిన కార్యకరణ రూపములగు నింద్రియములచేతను, తద్వికారములచేతను బహుప్రకారములుగాఁ జేయఁబడుచున్న కర్మములకు తాను గర్తగాఁ దలంచుచున్నాఁడు. ఓయర్జున! జ్ఞాని సత్త్వాదిగుణములను వానికర్మములను ఏర్పఱుచుట

యందు యథార్థమును దెలిసినవాఁడయి యింద్రియములు విషయమందుఁ బ్రవర్తింపుచున్నవని తలంచి విషయాసక్తుఁడుగానేరఁడు. అజ్ఞానులు మాయయొక్క సత్త్వాది గుణములచేఁ దెలియని వారలై ఇంద్రియములందును విషయములందు నాసక్తులగుచున్నారు; మందులగు కించిజ్జ్ఞులను ఆత్మవేత్తచలింపఁజేయఁ గూడదు. సమస్త కర్మములను నాయందుంచి, జ్ఞానముచే నిష్కాముఁడవగుచు,మమకార సంతాపములులేనివాఁడవై యుద్ధము సేయుము. ఇట్టి నావాక్యమందు విశ్వాసము కలిగి నాయందసూయ లేనివారలయిన మానవులు, ఈయుక్తలక్షణమయిన నాయభిప్రాయము నెల్లప్పుడు ననువర్తించుచున్నవారలై, పుణ్యాపాప రూపములైన కర్మములచే విడువఁబడుచున్నారు. నామతమునందసూయగల వారలయి యనువర్తింపనట్టి యవివేకులను సమస్త జ్ఞానములయందు మూఢులనుగాను జెడినవారినిగాను దెలియుము. జ్ఞానము గలవాఁడైనను, స్వకీయమైన జన్మాంతర సంస్కారమునకు సమానమగునటులఁ బ్రవర్తించుచున్నాఁడు, సమస్తప్రాణులు స్వభావము ననుభవించుచున్నారు. అందువలన నింద్రియ నిగ్రహంబును,

ఆజ్ఞయును ఏమిచేయఁగలవు? ఇష్టమందుఁ బ్రీతి యు ననిష్టమందు ద్వేషమును,ప్రతీంద్రియమునకును, శబ్దాది విషయములందున్నవి. ఆకారణమువలననట్టి రాగద్వేషముల కధీనత్వమును బొందఁగూడదు. అట్టి పురుషునికి రాగద్వేషములు, శాంతి శ్రేయోమా ర్గమునకు విఘ్నముసేయుచు శత్రువులుగానున్నవి. లెస్సగానాచరింపఁబడిన స్వవ్యతిరిక్త వర్ణాశ్రమా చార ధర్మమునకంటె గుణములేని దయినను స్వధ ర్మమే శ్రేష్ఠము. తనధర్మమందు మరణమును శ్రేష్ఠ మయినది. స్వేతర ధర్మము నరకపతనాది భయ మును బొందింపుచున్నది.

## అర్జునునివాక్యము.

ఓగోవింద! ఇట్లు తెలిసిన పిమ్మట ఈపురు షుఁడు పాపముసేయ నిశ్చయింపని వాఁడైనను, బలాత్కారమువలన భృత్యునివలె నేహేతువుచేఁ బ్రేరేపింపఁబడిన వాఁడగుచు దుష్కర్మము నాచ రించుచున్నాఁడు?

## శ్రీభగవద్వాక్యము.

ఓయర్జున! నీచేనడుగఁబడిన దానిఁజెప్పు చున్నాను వినుము. మనుజుని దుష్కర్మమునందుఁ

ప్రవర్తింపఁ జేయునది కామము. ఈకామమునెడ్డి హేతువు రజోగుణమువలనఁ బుట్టియున్నది: ఇట్టి కామమే క్రోధరూపముగాఁ బరిణమించుచున్నది. మఱియు నీకామమెట్టిదనిన అధికభక్షణగలదియు, పాపస్వరూప మయినదియుంగావున, ఇట్టికామమును మోక్షమార్గమునకు శత్రువుగాఁదెలియుము. సహజమైన పొగచేఁ గప్పఁబడిన అగ్నిరీతిగాను, మాలిన్యముచేఁగప్పఁబడిన యద్దమువలెను, మావిచేఁగప్పఁ బడిన గర్భమువలెను ఈజ్ఞానము, శత్రువైన యాకామముచేఁ గప్పఁబడియున్నది. ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, ఈకామమునకు ఆశ్రయములని చెప్పఁబడుచున్నవి. ఈకామము, ఈ యింద్రియములచే జ్ఞానమును గప్పి, దేహధారిని నానావిధములుగా మోహింపఁ జేయుచున్నది. ఓయర్జున! అట్టికారణమువలన నీవుతొలుత పంచేంద్రియముల నిగ్రహించి ఆత్మజ్ఞానమును, అనుభవజన్య జ్ఞానమును నశింపఁజేయు, పాపస్వరూపమయిన యీకామమును లెస్సగా విడువుము. జ్ఞాననిష్ఠులు, శ్రోత్రాదీంద్రియములను దేహాదులకంటె శ్రేష్ఠములయినవని చెప్పుదురు. అట్లు, మనస్సు, ఇంద్రియములకంటెను శ్రేష్ఠమయినది. నిశ్చ

ధియాత్మక బుద్ధి మనస్సుకంటె నుత్కృష్టమయి నది. బుద్ధికంటెను వ్యతిరిక్తమయి సాక్షిగానున్న * యాత్మ శ్రేష్ఠమగుచున్నది. ఓయర్జున! ఇట్లు బుద్ధి కంటెను వ్యతిరిక్తుఁడైన యాత్మ నెఱిఁగి మనస్సును లెస్సగానిగ్రహించి దుఃఖముచేఁ బొందఁదగిన కామస్వరూపమయిన శత్రువును చంపుము.

ఇది శ్రీభగవద్గీతా వచనంబను యోగశాస్త్రంబున శ్రీకృష్ణార్జున సంవాదంబునందు కర్మయోగము మూఁడవ యధ్యాయము.



* పరమాత్మయనుట.

# నాలవయధ్యాయము.

## జ్ఞా న యో గ ము.

-(*)-

### శ్రీ భ గ వ ద్వా క్య ము.

ఓయిగుడాకేశా! నాశరహితంబగు నీయోగమును నేను సూర్యునికిఁ జెప్పినవాఁడనై తిని. అతఁడు తనకుమారుండగు వైవస్వతమనువునకుఁ జెప్పెను. అతఁడిక్ష్వాకునకుఁ జెప్పెను. నిమి ప్రభృతి రాజర్షులిట్లు పారంపర్యముచేఁ బొందఁబడిన యీయోగము నెఱుఁగుదురు. బహుకాలముచే నీలోకమునం దట్టియోగము సంప్రదాయ విచ్ఛేదముచే నశించెను. అట్టిపురాతనమైన యోగమే, నాచే నిప్పుడు నీకొఱకుఁ జెప్పఁబడెను. నీవు నాకు భక్తుండవును జెలికాఁడవు నైతివి. ఇది శ్రేష్ఠంబయినదియును రహస్యంబయినదియు నగు జ్ఞానము.

(౪)

అర్జునునివాక్యము.

ఓ కేశవ! నీజన్మమిప్పుడు; సూర్యునిజన్మమో, మునుపు. అట్లుండఁగా,స్వర్గాదియందు నీవు చెప్పి తవనునది ఏదిగలదో దానిని నే నెటులఁ దెలియుదును?

శ్రీభగవద్వాక్యము.

ఓయర్జున! నాకును, నీకు ననేక జన్మము లతిక్రమించినవి. అట్టిసమస్త జన్మములను నేనెఱుఁగుదును; నీవెఱుంగవు. నేనుజన్మము లేనివాఁడను; నాశరహితమయిన స్వభావము గలవాఁడను;స్వకీయమైన త్రిగుణాత్మకమగు మాయను వశముసేసికొని నామాయచే నవతరించు చున్నాను. ఓయర్జున! ఎపుడెవుడు వర్ణాశ్రమోచిత ధర్మమునకు నాశనమవుచున్నదో అపుడపుడు మాయచే నన్ను బుట్టించుచున్నానుగదా? సన్మార్గప్రవర్తకులరక్షణ కొఱకును, పాపాత్ములనాశనము కొఱకును,ధర్మము నిలుపుటకొఱకును, ప్రతియుగమునందును నేనవతరించుచున్నాను. ఓయర్జున! అప్రాకృతమయిన నామాయాదిరూప జన్మమును, సాధురక్షణాదికర్మమును, యథార్థముగా నెఱింగిన పురుషుఁడు, ఈశరీరమును విడిచియు, మరల

జన్మము నొందక నన్నేపొందును. అనురాగ భయ క్రోధములు లేని నాస్వరూపులై, నన్నా శ్రయించిన యనేకులయిన సత్పురుషులు జ్ఞాన మనెడి తపస్సుచేఁ బరిశుద్ధులయి నాస్వరూప మును సాక్షాత్తుగాఁబొందిరి. ఓయర్జున! ఏ రూపముగా నన్నెవరెవరు దెలియుచున్నారో, నేనా రూపముననే వారల ననుగ్రహించుచున్నా ను. కావున, మనుష్యులు సర్వప్రకారములచే నామార్గము ననుసరించుచున్నారు. కర్మములఫల సిద్ధిని గోరుచుండెడి జనులు ఈలోకమునందు ఇంద్రాదిదేవతలను సేవించుచున్నారు. ఈ మను ష్య లోకమునందు కర్మమువలనఁ బుట్టిన ఫల ప్రాప్తియొక్క సిద్ధి శీఘ్రముగానగుచున్నది. నాచే బ్రహ్మక్షత్రియాది వర్ణచతుష్టయమును, సత్త్వాది గుణములయొక్కయు కర్మముయొక్క విభాగము వలన సృష్టింపఁబడెను. అట్టి కర్మమునకుఁగర్తనైన నన్ను గర్తగాని వానినిగా నాశములేని వానినిగాఁ దెలియుము. సృష్ట్యాది కర్మములు నన్నంటవు. నాకుఁ గర్మఫలమందిచ్ఛ లేదు. ఇట్లు నన్నెఱుంగు వాఁడు కర్మములచేఁ గట్టువడఁడు. ఇట్లెఱింగి పూర్వులగు ముముక్షువులచేఁ గర్మము సేయంబ

డెను. ఆకారణంబువలన నీవును బూర్వులగు జనకాదులచేఁ జేయంబడిన పురాతనమయిన కర్మమునే చేయుము. కర్మమెట్టిది? అకర్మమెట్టిది? అనెడి యిట్టి కర్మజ్ఞానవిషయమయి, బుద్ధిమంతులు మోహమును జెందిరి. అట్టి కారణంబువలన నీకొఱకు అట్టి కర్మాకర్మములను లెస్సగాఁ జెప్పెదను. ఇందువలన అశుభకరమైన సంసారమువలన విముక్తుఁడవుగాఁగలవు. శాస్త్రవిహితంబగు కర్మతత్త్వమును దెలియందగినది గలదు. నిషిద్ధకర్మతత్త్వమును దెలియందగినదిగలదు. కర్మరహిత తూష్ణీంభావ తత్త్వమును దెలియందగినది కలదు. కావున, కర్మాకర్మ వికర్మముల యథార్థగతి దెలియనశక్యమయినది. దేహచేష్టాది సర్వవ్యాపార రూపమైనకర్మమందు *కర్మమును ×అకర్మమునందుఁ+గర్మమును జూచువాఁడు మానవులయందు నిశ్చయాత్మక బుద్ధి గలవాఁడగును; వాఁడే సమస్త కర్మములను జేసినవాఁడును యోగియునగును. యథోక్త

---

* బ్రహ్మస్వరూపమనుట.

× చలనాదులులేక కేవలజడరూపమైనప్రకృతియందనుట.

+ జాగ్రదాదిసర్వవ్యాపారమనుట.

దర్శియైనవాని సమస్తకర్మములు గోరంబడినసం
కల్పములేనివగుచున్నవి. బ్రహ్మవేత్తలు జ్ఞానమను
నగ్నిచేఁ దహింపఁబడిన సకల శుభాశుభకర్మములు
గలిగిన యాపురుషుని పండితునిగాఁ జెప్పుదురు.
కర్మకర్తృత్వాభిమానమునువిడిచి నిత్యమును, విష
యములందును, గర్మఫలముల యందును, గర్తృ
త్వాభిమాన కాంక్షలేక జ్ఞానముచేఁ దృప్తుఁడగు
చు నిరాశ్రయుండై కర్మమందుఁ బ్రవర్తించినవాఁ
డును గొంచమైనను జేయనివాఁడగుచున్నాఁడు.
నిగ్రహింపఁ బడినదియు, కోరికలేనిదియు నగు
నంతఃకరణమును, బాహ్య కార్య గణ సంఘా
తంబును గలిగిన వాఁడును, విడువంబడిన సమస్త
సంగ్రహము గలవాఁడును, శరీరస్థితి మాత్రోప
యోగమైన కర్మమును జేయువాఁడునగు జనుఁడు
సంసారబంధమును బొందఁడు. అప్రార్థిత ప్రాప్త
ముచే సంతోషించినవాఁడును, శీతోష్ణాది ద్వంద్వ
దుఃఖముల నతిక్రమించినవాఁడును, విగత మత్స
రుఁడును, యదృచ్ఛాలాభప్రాప్తియందును అప్రా
ప్తియందును దుల్యుఁడునైన పురుషుఁడు కర్మము
సేసియును సంసారంబుచేఁ గట్టంబడఁడు. విగతాస
గలవాఁడును, సంసారబంధ ముక్తుఁడైనవాఁ

డును, జ్ఞానమందుంచిన చిత్తము గలవాఁడును, యజ్ఞము కొఱకు లోకసంగ్రహార్థమైన కర్మము సేయువాఁడు నగువానికి ఫలముతోఁగూడిన కర్మము మిక్కిలినశించుచున్నది. హోమ సాధనము లైన సృక్స్రువాదులు, బ్రహ్మస్వరూపమే; ఆజ్యాది హవిస్సును, బ్రహ్మమే; బ్రహ్మమనెడి యగ్ని యందుఁ గర్తృరూపమగు బ్రహ్మముచేనైన హవనక్రియయును బ్రహ్మమే; అట్టి బ్రహ్మమనెడి కర్మమునందుఁ జిత్తైకాగ్ర్యముచేఁ బొందఁదగిన ఫలమును బ్రహ్మమేయని తెలిసినవానికిఁ గర్మము లేదు. కొందఱు కర్మయోగులు దేవతాయజన సాధనమైన యజ్ఞము ఫలాసక్తిచేఁ జేయుచున్నారు. మఱికొందఱు జ్ఞానులు హవిస్స్రువాది, యజ్ఞ సాధనముచేతనే పరమాత్మతోఁ గూడిన యాత్మను బ్రహ్మమనెడు యజ్ఞవిధానమగు నగ్నియందు హోమము సేయుచున్నారు. మఱికొందఱు నైష్ఠికులు శ్రోత్రము మొదలగు ఇంద్రియములను, ఇంద్రియనిగ్రహములనెడి యగ్నులయందుహోమము సేయుచున్నారు. మఱికొందఱు శబ్దాశబ్ద విషయములను ఇంద్రియములనెడి యగ్నులయందు వేల్చుచున్నారు. మఱికొందఱు సమస్త

జ్ఞానేంద్రియ, కర్మేంద్రియముల శబ్దాదివిషయము లను బ్రాణాది దశవాయువుల బహిర్గమనాది కర్మ ములను జ్ఞానంబుచేఁ బ్రకాశింపంజేయఁ బడిన యాత్మ సంయమ మనెడి యగ్నియందు, +వ్రేల్చు చున్నారు. మఱికొందఱు పుణ్యతీర్థాదులయందు, ద్రవ్యదానంబనెడి యజ్ఞముగలవారును; మఱికొం దఱు కృచ్ఛ్రాది తపమనెడి యజ్ఞముగలవారును; కొందఱు ప్రాణాయామాది యోగములు యజ్ఞ ముగాఁ గలవారును; మఱికొందఱు వేదపారా యణ శాస్త్రార్థ పరిజ్ఞానములు, యజ్ఞముగాఁ గల వారును; మఱికొందఱు జయింపఁ బడిన ఇంద్రి యములు గలవారును; మఱికొందఱు తీక్ష్ణనియ మము గలవారును; మఱికొందఱు అపాన వ్యా పారమునందుఁ బ్రాణవ్యాపారమును వ్రేల్చుచు న్నారు. అటులనే, ప్రాణ వ్యాపారమునందు నపానవ్యాపారమును వ్రేల్చుచున్నారు; పూరక, రేచక, రూపప్రాణాయామము లాశ్రయములు గాఁగల మఱికొందఱు ప్రాణాయామమందాసక్తు లై ప్రాణాపానవాయుగతులను నిరోధించి కుం భకమను బ్రాణాయామమును జేయుచున్నారు;

---

+ సర్వమును ఆత్మయందే చేర్చుచున్నారనుట.

మఱికొందఱు నియతాహారులై ప్రాణములయం దుఁ బ్రాణములను హోమము సేయుచున్నారు; వీరందఱును, యజ్ఞము దెలిసినవారలును, యజ్ఞ ముచేఁ నశింపఁ జేయఁ బడిన పాపములు గల వారునగుచున్నారు. యజ్ఞములయందు మిగిలిన యమృతమును భుజించిన వారు శాశ్వత బ్రహ్మ మును బొందుచున్నారు. ఓయర్జున! ఈచెప్పినయజ్ఞ ములలో నొక్కటియైనను జేయనివానికి నీసర్వ ప్రాణి సాధారణమైన లోకములేదు; అట్లుండ గాఁ బరలోకమెక్కడిది? ఇట్లు బహువిధములైన యజ్ఞ ములు, వేదము యొక్క ముఖద్వారమునందు విస్తీ ర్ణములై యున్నవి. ఈ సమస్త యజ్ఞములను కర్మమువలనంబుట్టిన వానినిగాఁ దెలియుము. ఇటుల దెలిసినచో, సంసారబంధము వలన విడువంబడఁ గలవు. ఓయర్జున! ద్రవ్యసాధనసాధ్యమైన యజ్ఞ మునకంటెను జ్ఞానస్వరూపంబగు యజ్ఞముమిగుల శ్రేష్ఠము. సమస్త కర్మము నాశనము గానిది యగుచు బ్రహ్మజ్ఞానమునందు నంతర్భూతమగుచు న్నది. తత్త్వవిదులగు జ్ఞాననిష్ఠులు, నీకునుపదే శించునట్టి జ్ఞానమును సాష్టాంగ నమస్కారముల చేఁ, దెలియని విషయముల నడుగుటచేగురుశు

శాస్త్రము వలనఁ దెలియుము తత్త్వదర్శులైన జ్ఞానులు నీకుజ్ఞానమునుపదేశింపఁగలరు. ఓయర్జున! ఏజ్ఞానము తెలిసిన, మరలనే తాదృశమైన మోహము నునీవు పొందవో, ఏజ్ఞానముచేత నాయందలి సమస్తభూతములను నిశ్శేషముగాఁ నీయందే చూడఁ గలవో, అట్టిజ్ఞానమును దెలియుము: అటుమీఁదనుక పరబ్రహ్మస్వరూపుఁడనైన నాయందా ప్రాణులను జూడఁగలవు. సమస్త పాపములు సేసిన వారికంటెను మిగుల పాపముసేసిన వాఁడవైతి వేని, నీవుజ్ఞానమనెడితెప్పచేతనే సమస్త పాపములనెడి సముద్రములను లెస్సగాఁదరింపఁ గలవు. మిగుల ప్రకాశించెడు నగ్నిహోత్రుఁడు కట్టెలను భస్మము సేసెడిరీతిగా జ్ఞానమనెడి యగ్ని సమస్త కర్మములను భస్మముచేయుచున్నది. ఈలోకమునందు జ్ఞానముతో సమానమైనదియును పావనమైనదియు నేమియులేదు. బహుకాలము యోగాభ్యాసముచేతను లెస్సగా సిద్ధుఁడైన వాఁడే తనయందా యాత్మజ్ఞానమును బొందుచున్నాఁడు. గురు వేదాంత వాక్యములయందు శ్రద్ధగలవాఁడును, సంయతేంద్రియుఁడును, జ్ఞానమందాసక్తిగలవాఁడునగు జనుఁడు జ్ఞానమును బొందుచున్నాఁడుజ్ఞాన

ములేనివాఁడును, గురు వేదాంత వాక్యములయందు శ్రద్ధ లేనివాఁడును, సంశయ మనస్సు గలవాఁడు నగు జనుఁడు నశించుచున్నాఁడు. సంశయమనస్సు గలవానికి ఈ సర్వప్రాణి సాధారణమైన లోకము లేదు; పరలోకమును లేదు; సుఖమును లేదు. ఓధనంజయ! యోగముచే విడువంబడిన సర్వకర్మములు గలిగినవాఁడును బ్రహ్మజ్ఞానముచే ఛేదింపఁబడిన సందేహముఁగలవాఁడును, దృఢమనస్కుఁడు నగుఁబురుషుని పుణ్యపాపకర్మములు బంధింపవు. ఓయర్జున! కావున, జ్ఞానమనెడి ఖడ్గముచే నవివేకమువలనఁబుట్టినదియును, మనస్సునందున్నదియునగు నీసందేహమును ఛేదించి ఆత్మజ్ఞానయోగము నవలంబింపుము. ప్రకృతమైన యుద్ధమునకులెమ్ము.

ఇది శ్రీభగవద్గీతా వచనంబను యోగశాస్త్రంబున శ్రీకృష్ణార్జున సంవాదంబునందు జ్ఞానయోగము నాలవయధ్యాయము.

---

# ఐదవయధ్యాయము.



## కర్మసన్న్యాసయోగము.



### అర్జునునివాక్యము.

ఓమాధవ! శాస్త్రీయంబులగుఁ గర్మవిశేషంబులపరిత్యాగంబును, మరల శాస్త్రీయమైన కర్మయోగంబును జెప్పుచున్నావు. ఈరెంటియందును శ్రేష్ఠంబగు దానిని నిశ్చయమగునటుల నాకు లెస్సగాఁజెప్పుము.

### శ్రీభగవద్వాక్యము.

ఓయర్జున! కర్మపరిత్యాగము కర్మానుష్ఠానము ఈరెండునుమోక్షమును గలుగఁజేయునవియే. ఆ రెంటియందును గర్మపరిత్యాగమునకంటెను గర్మయోగమే శ్రేష్ఠంబగు. రాగద్వేషములులేనివాఁడు సంసారబంధంబువలన అనాయాసముగా విడువంబడు; కావున, ద్వేషింపనివాఁడును గోరనివాఁడు నగుఁ గర్మయోగి, కర్మానుష్ఠానకాలమందును సన్న్యాసియని తెలియందగినవాఁడగు. మూఢులుసన్న్యా

సకర్మయోగములు భిన్నంబులయినవని చెప్పుదురు. జ్ఞాననిష్ఠులో, అట్లుచెప్పరు. సాంఖ్యయోగములలో నొకదానినిలెస్సగా నాశ్రయించిన వాఁడైనను సాంఖ్యయోగములఫలములను బొందును. జ్ఞాననిష్ఠులచేఁ బొందఁబడుస్థానము, కర్మయోగులచేఁబొందఁబడు. జ్ఞాన కర్మయోగములను సమఫల ప్రదములయిన వానినిగాఁ జూచువాఁడు లెస్సగాఁ దెలిసిన వాఁడగును. కర్మయోగములేనిచోఁ, బారమార్థికతను బొందుటకొఱకై యత్నించుట దుఃఖహేతువగును. కర్మయోగముతోఁ గూడినమననశీలుఁడు శీఘ్రముగా బ్రహ్మమును బొందుచున్నాఁడు. కర్మయోగయుక్తుఁడైన వాఁడును, బరిశుద్ధమైన చిత్తముగలవాఁడును, జయింపఁబడిన దేహముగలవాఁడును, గెలువఁబడిన యింద్రియములు గలవాఁడును, సమస్తమైన బ్రహ్మాదిస్తంబపర్యంతముండెడి భూతములయొక్క యాత్మయైన పురుషుఁడు కర్మమును జేయుచున్నవాఁడైనను అట్టి కర్మముచే నంటఁబడఁడు. యథార్థమును దెలిసినవాఁడు చూచుచు, వినుచు, స్పృశించుచు, ఆఘ్రాణించుచు, భుజించుచు, నడచుచు, నిట్టూర్పువిడుచుచు, పలుకుచు, విడుచుచు, గ్రహించుచు,

కన్నులు తెఱచుచు, కన్నులుమూయుచు నున్నవాఁడయ్యును శ్రోత్రాదీంద్రియములు విషయములయందుఁ బ్రవర్తించుచున్నవని నిశ్చయించినవాఁడగుచు, నించుకయయినను నేను జేయలేదని సమాహిత చిత్తుండై తలంచుచున్నాఁడు. సమస్తకర్మములను బరమాత్మయందుంచి ఆసక్తిని విడిచి చేయువాఁడు ఉదకముచే నంటఁబడని తామరాకు చందంబునఁ బాపముచే నంటఁబడఁడు. కర్మయోగులు చిత్తశుద్ధికై ఫలాసక్తిని విడిచి శరీరముచే స్నానాదికర్మములను,మనస్సుచె ధ్యానాదికర్మములను, బుద్ధిచే నిశ్చయాదికర్మములను, కేవలముతైన యింద్రియములచే శ్రవణాది కర్మములను, చేయుచున్నారు. సమాహితచిత్తుఁడు కర్మఫలమును విడిచి, నిష్ఠయందుఁబుట్టిన శాంతినిబొందుచున్నాఁడు. సమాహిత చిత్తుఁడు గానివాఁడు కోరుటచేఁ గర్మఫలమందాసక్తుఁడై కట్టంబడుచున్నాఁడు. ఇంద్రియనిగ్రహము గలవాఁడు వివేకజ్ఞానముగలమనస్సుచే సమస్త కర్మములనువిడిచి నవద్వారములుగల పట్టణమువంటి శరీరమందు చేయని

వాఁడును, చేయింపనివాఁడునునై యనాయాస ముగానున్నాఁడు. ఆత్మ నరునికిఁ గర్తృత్వము గలుగఁజేయఁడు, కర్మములసృజింపఁడు, కర్మ ఫలములతో సంయోగమును గలుగజేయఁడు. అయి నను స్వభావమువర్తించుచున్నది. ఆత్మ, ఒకా నొక భక్తునిపాపపుణ్యములను గ్రహింపఁడు. అజ్ఞానముచే వివేకజ్ఞానముగప్పంబడుచున్నది. ఆయజ్ఞానముచే నవివేకులైన సంసారులు మో హమునొందుదురు. పరమాత్మయొక్క వివేక జ్ఞానముచేత, ఆయజ్ఞానమును నశింపఁజేయుట వలన వారిజ్ఞానము, సూర్యునివలెనే ఆయజ్ఞాన మునకుం బరమైన పరమార్థ తత్త్వమును ప్రకా శింపఁజేయుచున్నది. జ్ఞానముచేఁ బోఁగొట్టఁబడిన పాపములుగలవారలా బ్రహ్మమందె బుద్ధిగలవా రలును, ఆపరబ్రహ్మమే యాత్మరూపముగాఁగల వారలును, ఆబ్రహ్మమందె నివేశముగలవారలునై పునరావృత్తిరహితమగు మోక్షమును బొందు చున్నారు. విద్యావినయములుగల బ్రాహ్మణు ని యందును గోవునందును, ఏనుఁగునందును, కుక్కయందును, దానినివండుకొని తిను చండాలుని

యందును సమానదృష్టి కలవారలు జ్ఞానులు. అట్టి జ్ఞానముచేత బ్రహ్మస్వభావమందు నిశ్చలమైయున్న యంతఃకరణము గలవారిచే నీలోకమందే జన్మసంస్కారముజయింపఁబడెను. ఏకమైనబ్రహ్మము నిర్దోషమైనది. ఆకారణమువలననే యట్టి సమదర్శులు బ్రహ్మమునందున్నవారలగుచున్నారు. నిస్సంశయ బుద్ధిగలిగి మోహవర్జితుఁడైన బ్రహ్మజ్ఞాని, బ్రహ్మమునందున్న వాఁడగుచు ప్రియమును బొంది సంతోషించఁడు, అనిష్టమునుబొంది భయపడఁడు. స్థిరమైన జ్ఞానముగల మూఢుఁడుగాని ఆబ్రహ్మవేత్త బ్రహ్మమునందుండి బహిర్భవములైన శబ్దాదివిషయములయందంటని యంతఃకరణము గలవాఁడై చిత్తవృత్తియందు సుఖమును బొందుచున్న బ్రహ్మజ్ఞాని బ్రహ్మమందు నిర్మలమైన యంతఃకరణము గలవాఁడగుచు నక్షయమైన సుఖమును బొందుచున్నాఁడు. విషయేంద్రియములవలనఁబుట్టిన సుఖములు, విషయేంద్రియసంయోగ వియోగములవలనఁ గలిగిన యావిషయభోగములు, దుఃఖమునకుఁ గారణములైనవిగావున తత్త్వజ్ఞుఁడా విషయభోగములందా సక్తుఁడుగాఁడుగదా? శరీరమువిడుచుటకు ముందీలోకమునం

దే కామక్రోధములవలనఁబుట్టిన వేగమును సహించుటకొఱకు సమర్థుఁడగునరుఁడు, ఇంద్రియనిగ్రహము గలవాఁడును సుఖముగలవాఁడు నగును. అంతరాత్మయందు సుఖముగలవాఁడును, ఆత్మారాముండును, అంతః ప్రకాశముగల వాఁడునైన యోగి బ్రహ్మస్వరూపుఁడై బ్రహ్మానందముఁ బొందుచున్నాఁడు. క్షీణించిన పాపముగలవాఁడును, ఛేదింపఁబడిన సంశయముగలవాఁడును, నిగ్రహింపఁబడిన చిత్తముగలవాఁడును, సమస్త ప్రాణుల హితమందా సక్తుఁడునైన ఋషి మోక్షమును బొందుచున్నాఁడు. కామక్రోధములచే విడువఁబడి నియమింపఁబడిన యంతఃకరణముగలిగి తెలియఁబడిన యాత్మస్వరూపముగల యతులకు నిహపరాదులయందంతటను బ్రహ్మానందముకలదు. బహిర్భవములగు శ్రోత్రాది ద్వారములచే బుద్ధియందుఁ బ్రవేశించిన శబ్దాది విషయములను వెలుపఱిచి దృష్టిని కనుబొమల మధ్యమందుండఁజేసి ప్రాణాపానవాయువులను నాసికలలోపల సమానములుగా సంచరించునటులఁజేసి నియమింపఁబడిన యింద్రియమనోబుద్ధులుగలిగి మోక్షాసక్తుఁడును మునియునైయున్న యాపురుషుఁడు సర్వదా ము

క్తుఁడై యజ్ఞతపస్సులకు దేవతారూపముచే భో క్తయును, సమస్తలోకములకు నియామకుఁడును, సమస్త ప్రాణులకునుపకారియును, సర్వసాక్షియు నై నన్నెఱింగిసంసారోపరతినిఁబొందుచున్నాఁడు.

ఇది శ్రీభగవద్గీతా వచనంబను యోగశాస్త్రంబున శ్రీకృష్ణార్జున సంవాదంబునందుఁ గర్మసన్న్యాస యోగమైదవ యధ్యాయము.

---

# ఆఱవయధ్యాయము.

## ఆ త్మ సం య మ యో గ ము.

———(*)———

### శ్రీ భ గ వ ద్వా క్య ము.

కర్మఫలముల నపేక్షింపక చేయఁదగినకర్మమును జేయు పురుషుఁడు కర్మపరిత్యాగము గలవాఁడును యోగియునగును, మఱియు నగ్నులు లేనివాఁడును, దపోదానాదిక్రియలు లేనివాఁడును గానేరఁడు. ఓయర్జున! జ్ఞాననిష్ఠులచే, సర్వకర్మపరిత్యాగ లక్షణముగలదిగాఁ జెప్పంబడునట్టి యోగమును గర్మానుష్ఠానలక్షణమని తెలియుము. విడువఁబడని ఫలవిషయసంకల్పముగల యొకానొకఁడు కర్మయోగి గానేరడు. జ్ఞానయోగమునెక్క-నిశ్చయించిన మునికిఁ గర్మము సాధనమని చెప్పఁబడుచున్నది. జ్ఞానము నెక్కి-న యామునికే సర్వకర్మనివృత్తి సాధనమని చెప్పంబడును. శబ్దాదివిషయములయందును, గర్మములయందును, ఆసక్తుండుగానివాఁడు సమస్త సంకల్పంబులఁ బరిత్యజిం

చునట్టి శీలంబు గలవాఁడనియు, జ్ఞానము పొందిన వాఁడనియుఁజెప్పంబడు. ఆసక్తిలేనిమనస్సుచే సంసారసాగరమగ్నుండైన తన్నుద్ధరింప వలయు; తన్నధోగతిఁ బొందింపఁగూడదు. అదేప్రకారము తనకు వశముగాని మనస్సే తనకు శత్రువు. దేహేంద్రియాది సంఘాతంబును జయింపఁబడనటులఁ జేయునట్టి మనస్సుగల వానికి మనస్సు శత్రువవలె శత్రుకార్యమయిన యపకారమందుండును. జయింపఁబడిన మనస్సుగల యుపశాంతుండయిన పురుషునికి మనస్సు మిక్కిలి శీతోష్ణాది సుఖదుఃఖముల యందును, బూజానిందలయందును, ఆత్మానుభవమునందేయుండును. శాస్త్రోక్తజ్ఞానముచేతను, ఆత్మానుభవజ్ఞానముచేతను, దృప్తిబొందిన మనస్సుగలవాఁడు చలింపక యింద్రియ నిగ్రహముగలిగి, పెంకుతాయి బంగారులను సమానముగాఁ జూచునట్టియోగి యాత్మానుభవము గలవాఁడని జెప్పఁబడుచున్నాఁడు. ఉపకారముసేసినవానియందును, మిత్రునియందును, శత్రువునందును, బక్షపాతములేనివానియందును, మధ్యస్థునియందును దనతోవిరోధించినవానియందును, బంధువులయందును, సాధువులయందును, బాపాత్ముల

యందును, సమబుద్ధిగలవాఁడు యోగారూఢుండ గు. ఆత్మధ్యానము గలవాఁడు ఏకాకియును, నియమింపఁబడిన మనశ్శరీరములు గలవాఁడును, ఆశలులేనివాఁడును, బరిగ్రహము లేనివాఁడును, ఏకాంతమునందున్న వాఁడునై, అంతఃకరణమును సదానిగ్రహింపవలయును. పరిశుద్ధమైన స్థానము నందు మిగుల పొడవుగానిదియు, మిగులతక్కువ గానిదియు, దర్భలు చర్మము వస్త్రము వీనిని క్రమముగా నొకదానిమీఁద నొకదానినిపఱచియే ర్పఱుపఁబడినదియునైన ఆసనంబునుదనకు నిశ్చల మగునటులనుంచి స్థిరాసనమునందుఁ గూర్చుండి, మనస్సును నిశ్చలముగాఁజేసి, నియమింపఁబడిన చి త్తేంద్రియ వ్యాపారముగల యోగాభ్యాసకుఁడు అంతఃకరణ పరిశుద్ధికొఱకు యోగము నభ్యసిం పవలయు, నిశ్చలమైన శిరఃకంఠములను సమా నముగా ధరించుచున్నవాఁడును, స్థిరుఁడైనవాఁ డును, స్వకీయమైననాసికాగ్రమును జూచుచు ది క్కులను జూడనివాఁడును, ఉపరతమైన మనస్సు గలవాఁడును, భయములేనివాఁడును, బ్రహ్మచర్య వ్రతమునందున్న వాఁడును, మనస్సును లెస్సగాని యమించి నాయందుఁ జిత్తముగలవాఁడును, నే

నేయుత్కృష్టముగాఁ గలవాఁడును, సమాహిత చిత్తుండునై యుండవలయును. నియతమానసుండును, యోగాభ్యాసకుండును, ఎల్లప్పుడునివ్విధంబున మనస్సును సమాధానముసేయుచున్నవాఁడును, మోక్షమేయుత్కృష్టముగాఁ గలవాఁడునునై నాయధీనమైన సంసారోపరతిని బొందుచున్నాఁడు. ఓయర్జునా! యోగమపరిమితముగా భుజించువానికిని, బొత్తిగా భుజింపని వానికిని, మిగుల నిద్రపోవువానికిని, నిద్రలేకయుండువానికిని గలుగనేరదు. తగినయాహారమును, సంచారమును గలిగి కర్మలయందుఁ దగిన వ్యాపారములును, దగిననిద్రయును, మేలుకొనుటయును, గల పురుషునికి యోగము దుఃఖము పోఁగొట్టునట్టిదియగును. మనస్సులెస్సగా నిగ్రహింపఁబడినదై తనయందేయున్నప్పుడు ఏకోరికయు లేనివాఁడు యోగియని చెప్పఁబడును. గాలిలేనిస్థలమునందున్న దీపముచలింపకుండు విధంబున ఆత్మసమాధి యోగమును జేయువాఁడును, నియమింపఁబడిన యంతఃకరణముగలవాఁడును నగుయోగియును జలింపఁడను నదియేయుపమానమని యోగశాస్త్రజ్ఞులచేఁ జెప్పఁబడెను. ఏయవస్థయందు మనస్సు యో

గానుష్ఠానముచే నిగ్రహింపఁబడినదై యుప
రతిని బొందుచున్నదో, ఏయవస్థయందు నంతఃకర
ణముచేఁ బరమాత్మను వీక్షించుచు తనయందే యా
నందపడునో, ఏయవస్థయందు నింద్రియగోచరం
బుగాక బుద్ధిచే గ్రహింపఁదగిన యెట్టి సుఖముగ
లదో, యట్టియనంతమైన సుఖమును ఏయవస్థ
యందుఁ దెలియునో, ఏయాత్మలాభమును బొంది
ఆయాత్మలాభమునకంటె నితరమైన లాభమునధిక
ముగాఁదలపఁడో, ఏయాత్మతత్త్వమందున్న వాఁడ
ధికమైన దుఃఖముచేఁ గదల్పఁ బడఁడో అట్టిదుః
ఖముయొక్క సంయోగ వియోగములు లేకుండు
టను యోగమను పేరుగల దానినిగాఁ దెలియవల
యును. నిస్సంశయమగు నిర్ణయంబుగలిగి దుఃఖ
పడని చిత్తముచేత నట్టియోగముఁ గూర్పఁదగినది.
సంకల్పమే పుట్టువుగాఁ గలిగినయెల్ల కోరికలను
నిశ్శేషముగావిడిచి మనస్సుచేతనే ఇంద్రియసమూ
హమునంతటను నిగ్రహించి, యోగమును గూర్ప
వలయును. ధైర్యముచే నిగ్రహింపఁ బడినబుద్ధిచే,
మనస్సు నాత్మయందున్న దానినిగాఁజేసి మెల్లమె
ల్లఁగా నుపరతిని బొందింపవలయును, కొంచమైనను
జింతింపఁగూడదు. చంచలమైనదిగనుకనే స్థిరముగా

నిమనస్సు ఏయేవిషయములయందు సంచరించుచున్న దో, ఆయావిషయములవలన, ఈమనస్సును మరల్చి తనయందే యధీనతను బొందింపవలయును. శాంతిపొందినమనస్సుగలవాఁడును, క్షీణమైనరజోగుణముగలవాఁడును, జీవన్ముక్తుఁడైనవాఁడును, బాపరహితుఁడునైన యోగిని నిరతిశయమైన సుఖము తానే పొందుచున్నదిగదా? ఇట్లుసర్వదా అంతఃకరణమును వశము సేయుచున్న పాపరహితుండయిన యోగి యనాయాసంబుచే బ్రహ్మమును లెస్సగాఁ జూచుచున్నవాఁడయి యత్యంతమయిన సుఖమును బొందుచుండు. సమస్త భూతంబులయందును సమదర్శియును, యోగముతోఁ గూడిన యంతఃకరణము గలవాఁడును సమస్త భూతములయందుఁదన్నును దనయందు సమస్త భూతములను జూచువాఁడును సమస్తమునునాయందుఁ జూచును; వానికినేను పరోక్షము నొందను; వాఁడు నాకుఁ బరోక్షమునొందఁడు. అభేదమును బొందినవాఁడగుచు, సమస్త భూతములయందును నన్ను సేవించునట్టి యోగి సర్వప్రకారములచే వర్తించుచున్న వాఁడయ్యును నాయందు వర్తించుచున్నాఁడు. ఓయర్జున! సుఖమునైనను దుఃఖమునైనను, దనసా

మర్థ్యముచే సమస్తభూతంబులయందును దుల్యం బగునటులఁ జూచునట్టి జ్ఞానిశ్రేష్ఠుండును నాకు సమ్మతుండుననగును.

## అర్జునునివాక్యము.

ఓమధుసూదన! నేను చంచలుఁడనగుటవలన మనస్సమాధానముచేఁ జెప్పఁబడిన యోగమునకుఁ జలింపని నిలుకడనుగానను. ఓమాధవా! మనస్సు చంచలమైనదియు, క్షోభపెట్టునదియు, నిగ్రహింపశక్యముగానిదియు, దృఢమైనదియుగా నున్నది. నేనట్టిమనోనిగ్రహమును, వాయునిగ్రహంబుంబోలె దుష్కరంబైనదానినిగాఁ దలంచుచున్నాను.

## శ్రీభగవద్వాక్యము.

భుజబలముగలయోయర్జున! మనస్సుచంచలమైనదియు, నిగ్రహింప శక్యముగానిదియునను టకుసంశయంబులేదు; అట్లైన నభ్యాసవైరాగ్యములచేనిగ్రహింపఁబడు; నిగ్రహింపఁబడని మనస్సుగలవానిచేఁబొందశక్యముగానియోగము, యత్నము సేయునట్టి స్వాధీన మనస్సు గలవానిచే

నుపాయము వలనఁ బొందుటకు శక్యమైనదని నామతము.

## అర్జునునివాక్యము.

ఓకేశవ! ఆస్తికబుద్ధితోఁ గూడియున్నవాఁ డును, నియమములేనివాఁడును, యోగమువలనఁ జలించిన మనస్సుగలవాఁడును నగుమానవుఁడు యోగఫలమును బొందక ఎట్టిస్థానమును బొందు చున్నాఁడు? ఓత్రివిక్రమ! పరమాత్మ యొక్క మార్గమునందు మూఢుఁడైన పురుషుఁడు నిరా శ్రయుఁడైనవాఁడగుచు కర్మజ్ఞానములమార్గము నుండి జారినవాఁడై చెదరిన మేఘమువలెఁ జెడి పోఁడాయేమి! ఓమాధవ! నీవు నాకుఁగలిగిన యీసందేహమును నిశ్శేషముగాఁ బోఁగొట్టఁ దగుదువు. ఈసంశయమును బోఁగొట్టువాఁడు నీకంటె నితరుఁడు దొరకఁడుగదా?

## శ్రీభగవద్వాక్యము.

ఓసవ్యసాచి! అట్టియోగభ్రష్టునకు నాశమీ లోకమునందును, బరలోకమునందును గలుగదు

ఓతండ్రీ! శుభమును జేసినవాఁడొకఁడును గుచ్ఛి తస్థానమును బొందఁడుగదా? యోగభ్రష్టుఁడు పుణ్యముచేసినవారిలోకమును బొంది యనేకసంవత్సరములచ్చటనే యుండి సదాచారవంతులగు శ్రీమంతుల గృహమునందుఁ బుట్టుచున్నాఁడు; అట్లుగాదేని నిశ్చయాత్మక బుద్ధిగల దరిద్రులగు యోగులకులమునందుఁ బుట్టుచున్నాఁడు. ఈ రెంటిలో రెండవదగు దరిద్రులగు యోగులకులమునందు జన్మము లోకమునందు మిగుల దుర్లభము. ఓకురునందన! అట్టియోగికులమునఁ బూర్వదేహమునందుఁ బుట్టిన బుద్ధిసంయోగమును బొందుచున్నాఁడు. పిమ్మట జ్ఞానసిద్ధి నిమిత్తమై మరలఁ బ్రయత్నము సేయుచున్నాఁడు. అట్టి పూర్వజన్మాభ్యాసముచేతనే అట్టియోగభ్రష్టుఁడు, అవశమనస్కుండైనను విషయములవలన నివర్తింపఁబడుచున్నాఁడు. యోగస్వరూపము దెలియనిశ్చయించినవాఁడు వేదోక్త కర్మానుష్ఠాన ఫలము నతిక్రమించుచున్నాఁడు. జ్ఞాననిష్ఠుఁడు ప్రయత్నమువలన యత్నము సేయుచున్నవాఁడును, పిమ్మట విముక్తములగుఁ బాపములుగలవాఁడును, అనేక జన్మసంస్కారమువలన సిద్ధుఁడైనవాఁడై పిమ్మట

పరమగతిని బొందుచున్నాఁడు. ఓయర్జున! యోగి కృచ్ఛ్రాదితపస్సులుగలవారికంటెను, శాస్త్రార్థపాండిత్యముగలవారికంటెను, గర్మపరులకంటెను శ్రేష్ఠుఁడనినామతము; ఆకారణమువలన యోగముగలవాఁడవుకమ్ము. శ్రద్ధగలవాఁడై నాయందునాసక్తమైన యంతఃకరణముచే నన్నుసేవించుచున్నవాఁడు సమస్తయోగులయందు శ్రేష్ఠుండనినామతము.

ఇది శ్రీభగవద్గీతా వచనంబను యోగశాస్త్రంబున శ్రీకృష్ణార్జున సంవాదంబునం దాత్మసంయమయోగము ఆఱవయధ్యాయము.

---

# ఏడవయధ్యాయము.

## విజ్ఞానయోగము.

-(*)-

### శ్రీభగవద్వాక్యము.

ఓయర్జున! నాయందుంచిన మనస్సుగలవాఁడవును, యోగముసేయుచున్న వాఁడవును, నేనే యాశ్రయముగాఁగలవాఁడవునయి సకలగుణ పరిపూర్ణుండనైననన్ను, సంశయములేనట్టు తెలియఁజేయు జ్ఞానమును వినుము. అనుభవజన్య జ్ఞానముతోఁగూడెనట్టి శ్రవణజన్యజ్ఞానమును సాకల్యంబుగా నేను నీకుఁజెప్పఁగలను; దానిం దెలిసికొనిన, నీ మోక్షవిషయమై మరలఁదెలిసికొనఁ దగినది మఱియొకటేమియును మిగిలియుండదు. శాస్త్రాధికారయోగ్యులగు వేయిమందియందొకా నొకండాత్మసిద్ధికొఱకు యత్నముసేయుచున్నాఁడు. యత్నముసేయుచున్నవారలయందును సిద్ధులైన వారలయందును, వేయింటియందొకానొకఁడు తత్త్వంబువలన నన్నుఁదెలియుచున్నాఁడు. పృథివీతన్మాత్ర గంధగుణంబును, ఉదకతన్మాత్ర రసగుణంబును, అగ్ని

తన్మాత్రరూపగుణంబును, వాయుతన్మాత్ర స్పర్శ గుణంబును, మనస్సును, ఆకాశతన్మాత్ర శబ్దగుణంబును, బుద్ధియును, అహంకారంబు నను నీ యెనిమిది విధములుగల భేదమును నామాయా శక్తిపొందియున్నది. ఓయర్జున! ఇట్టిప్రకృతి నికృష్టంబై యున్నది. ఇట్టిప్రకృతికంటె నన్యమైనదియు, జీవభూతమైనదియు, నుత్కృష్టమైనదియు, నగునాప్రకృతినిఁ దెలిసికొనుము. ఇట్టి ప్రకృతిచేతనే ఈజగత్తునాచే ధరింపఁబడుచున్నది. ఈరెండుప్రకృతులే సమస్తభూతములకును గారణములు గాఁగలవని దెలిసికొనుము. అట్టిప్రకృతిద్వయద్వారముచే నేనుసమస్తమైన ప్రపంచమునకు నుత్పత్తి కారణమును నాశనకారణమునని తెలిసికొనుము. ఓధనంజయ! నాకంటెనుమిగుల శ్రేష్ఠంబయిన మఱియొక కారణము కొంచమైనను లేదు. నాయందీ సమస్తమైనజగత్తు, దారమునందు రత్నసమూహంబునుంబోలెఁ గూర్పఁబడియున్నది. ఓయర్జున! ఉదకములయందు *రసమును, జంద్రసూర్యులయందుఁ గాంతియును సమస్త వేదంబులయందు నోంకారంబును, ఆకాశంబునందుశబ్దంబును, బుధు

* ఉదకములయొక్కసారమనుట.

షులయందుఁ బౌరుషంబును, భూమియందుఁ బరిమళించు గంధంబును, అగ్నియందుఁ దేజంబును, సర్వభూతంబులయందుఁ బ్రాణాధారంబైన ఆయుస్సును, దపస్సుగలవారలయందలి తపస్సును నేనగుచున్నాను. శాశ్వతుండనైన నన్నుసర్వభూతంబులకును బీజంబుగాను దెలిసికొనుము. ఇది యునుంగాక, నేను వివేకశక్తిగలవారల నిశ్చయాత్మకబుద్ధియును, తేజోవంతుల తేజంబును, నగుచున్నాను, ఓయర్జున! బలముగలవారల కామరాగవర్జితంబైన బలంబును, బ్రాణులయందుధర్మశాస్త్రవిరుద్ధంబుగాని కామమును, నేనగుచున్నాను. సత్త్వగుణముచేనైన శమదమాదులైనపదార్థములును రజోగుణముచేనైన దర్పహర్షాదులును, దమోగుణజనితంబైన శోకమోహాదులును, గలభావములునావలన నైనవేయని దెలిసికొనుము. అయినను ఆభావములయందు నేనులేను. మఱియు నాభావములు నాయందున్నవి. త్రివిధంబులగు సత్త్వాదిగుణ వికారంబైన యీశమదమాది పదార్థములచే మోహింపఁజేయఁబడిన యీసమస్తజగత్తు, ఇట్టిభావములకంటెనువిలక్షణుండును, నాశరహితుండునునైన నన్నెఱుంగదు. నాదగు నీత్రిగు

ణాత్మకమై యీచెప్పఁబడినదగు నామాయను దాఁ
టనశక్యంబైయుండు. ఆకారణంబువలన నన్నె
వరు శరణుఁబొందుదురో, అట్టివారు నామాయ
నతిక్రమింతురు. పాపములుసేసినవారును, వివేక
రహితులునైన మనుష్యాధములు మాయచే నప
హరింపఁబడిన జ్ఞానముగలవారలై యసురసంబం
ధంబైన హింసానృతాది స్వభావముల నాశ్ర
యించి నన్ను భజింపరు. ఓయర్జున! చోరవ్యా
ఘ్రాదులచేఁ బీడితుండైనవాఁడును, దెలియనిశ్చ
యించినవాఁడును, ధనకాముఁడును, ఆత్మజ్ఞానము
గలవాఁడునను ఈనాలుగు విధములుగల పుణ్య
వంతులైన జనులు నన్నుసేవించుచున్నారు. ఆ
నలుఁగురియందును, నిత్యయోగియు, ముఖ్యభక్తిగల
జ్ఞానియునధికుఁడగును, జ్ఞానికినేనుమిక్కిలి ప్రియుఁ
డను, నాకట్టిజ్ఞాని యిష్టుండుగదా? ఈ నలుగు
రునుత్కృష్టులే యగుదురు. జ్ఞాని యనిననేనే
యని నామతము. అట్టిజ్ఞాని, నియమింపఁబడిన
మనస్సుగలవాఁడై శ్రేష్ఠమును, ప్రాప్యస్థానమునై
న నన్నుఁబొందును. బహుజన్మములకడపట జ్ఞాన
ముగలవాఁడై సమస్తము వాసుదేవుండని నన్నుఁ
బొందునట్టి మహాత్ములుమిగుల దుర్లభులు. అట్టి

యమైన స్వభావముచే నియమింపఁబడిన జనులా యాయావిషయములచే నపహరింపఁబడినవివేకము గలవారలై యాదేవతారాధనాది నియమము నధిష్టించి యన్య దేవతలను భజింపుచున్నారు. ఏయే కామము గలవాఁడు భక్తిచే నేయే దేవతా విగ్రహమును శ్రద్ధతోఁబూజింప నిచ్ఛయించుచున్నాఁడో. వానికి నేనట్టి శ్రద్ధనే యచలమైనదానినిగాఁ జేయుచున్నాను. అట్టిభక్తుఁడు నాచేఁ జెప్పఁబడిన శ్రద్ధతోఁ గూడినవాఁడై యాదేవతావిగ్రహపూజ నిచ్ఛయించుచున్నాఁడు. నాచేతనే చేయఁబడిన యిష్టములైనకోరికలను, ఆవిగ్రహమువలనఁ బొందును. అన్యదేవతలను బూజించువారా దేవతలను బొందుచున్నారు. స్వల్పబుద్ధిగలయట్టి యన్యదేవతాపూజకులకుఁ గలుగు ఫలమునాశముగలదియని తెలియుము. నాభక్తులన్న నన్నుఁ బొందుదురు. నాశరహితమైనదియు నిరతిశయమైనదియు, శ్రేష్ఠమైనదియు, నగు నాస్వరూపమును దెలియని మూఢులు, అప్రకాశుడఁనైన నన్నుఁబ్రకాశము పొందిన వానినిగాఁ దలంచుచున్నారు. నేను సమస్తలోకములకును బ్రకాశమైన వాఁడనుగాను. జ్ఞానములేని యీజనము యోగముచేఁగప్పఁబడినదై నన్ను జన్మరహితునిగాను నాశరహితునిగా

నెఱుంగదు. ఓయర్జున! అతిక్రమించినవియు, ఉన్న వియుఁ, గాఁగలవియునగుఁ బ్రాణులను నేనె ఱుంగుదును. ఒక్కఁడును నన్నెఱుంగఁడు. ఓసవ్యసాచి! ఉత్పత్తికాలమందుఁ గామక్రోధంబుల వలనఁ బుట్టిన సుఖదుఃఖహేతువయిన యవివేకముచే సర్వభూతములు మిగుల నజ్ఞానముఁ బొందుచున్నవి. పుణ్యకర్మములు గల జనుల పాపమునాశముఁబొందుచున్నది. కావున, అట్టిజనులు ద్వంద్వాది సుఖదుఃఖహేతువయిన యవివేకముచే విడువఁబడినవారలునునిశ్చయమైన వ్రతముగలవారలునై నన్నుభజింతురు. జరామరణముల విడుపుకొఱకు నన్నాశ్రయించి యత్నించుజనులు, ఆబ్రహ్మమును, సమస్తమైన యధ్యాత్మమును, బ్రత్యగాత్మ విషయ వస్తువును, సమస్తకర్మము నెఱుఁగుదురు. ఆధిభూతాది దైవములతోఁ గూడిన వాఁడును అధియజ్ఞముతోఁగూడినవాఁడును నగునన్నుఁ దెలియువారంతకాలమునందును నియమింపఁ బడిన మనస్సుగలవారలై నన్నుఁదెలియుదురు.

ఇది శ్రీభగవద్గీతా వచనంబను యోగశాస్త్రంబున శ్రీకృష్ణార్జున సంవాదంబునందు విజ్ఞానయోగము ఏడవయధ్యాయము

## ఎనిమిదవయధ్యాయము.



## అక్షరపరబ్రహ్మయోగము.

### అర్జునునివాక్యము.

ఓపురుషోత్తమ! ఆబ్రహ్మమెట్టిది? అధ్యాత్మమెట్టిది? కర్మమెట్టిది? ఏది అధిభూతమని చెప్పఁబడెను? ఏది అధిదైవతమని చెప్పఁబడుచున్నది? ఓ మధుసూదన! ఈశరీరమందధిష్ఠాతయును బ్రయోజకుఁడును ఫలదాయకుఁడునెవ్వఁడు? ఈవిషయమునందెట్లు దెలియఁదగినవాఁడవగుచున్నావు?

### శ్రీభగవద్వాక్యము-

పరబ్రహ్మము, నాశరహితమయినది. ఆపరబ్రహ్మ స్వభావ మ*ధ్యాత్మమని చెప్పఁబడుచున్నది. ప్రాణులస్వరూపమునకు నుత్పత్తినిఁ జేయు

* దేహమును, బ్రత్యగాత్మస్వరూపముచే, నధిష్ఠించియుండునది యధ్యాత్మము. ఆయధ్యాత్మము బ్రహ్మరూపమయినదియె.

చున్న దేవతల నుద్దేశించి చేయునట్టి పురోడాశాది ద్రవ్యపరిత్యాగము కర్మమనుసంజ్ఞ గలది. దేహధారులలో శ్రేష్ఠుండ వగునోయర్జున! ప్రాణిజాతము నశింపనట్టి యుత్పత్తిగలవస్తువు, సూర్యాంతర్గతుండును, సకలప్రాణుల యింద్రియములకు ననుగ్రాహకుఁడును, హిరణ్యగర్భుండును, బరిపూర్ణుఁడగుఁ బురుషుఁడు అధిదైవతము. ఈశరీరమునందు సర్వయజ్ఞాభిమానియై విష్ణువనుపేరుగల దేవతను నేనే. దేహాంతసమయమునందున న్నే స్మరించు చున్నవాఁడు శరీరమును విడిచి నాస్వరూపమునుబొందు చున్నాఁడు. ఈయర్థమునందు సందేహములేదు. ఇట్టివిషయము నావిషయమైనదియే కాదు. మఱియే మనినఁ జెప్పుచున్నాను వినుము. ఓయర్జున! అంత కాలమునందు నేయే దేవతావిశేషమును స్మరించుచు శరీరమును ద్యజించునో, సదా ఆయాదేవతా విశేషభావమును జింతించువాఁడై ఆయాస్మరింపఁ బడిన భావమునే పొందుచున్నాఁడు. అంత్యకాల మునందు నితరదేవతానుచింతనము పునర్జన్మాదులకుఁగారణమగుచున్నది; కావున నన్ను స్మరింపుము; యథాశాస్త్రముగా యుద్ధము సేయుము. నీవునాయందుంపఁబడిన మనోబుద్ధులు గలవాఁడ

వై నన్నేపొందఁగలవు; సంశయములేదు. ఉపాస నప్రకారముఁ జెప్పెదనువినుము. అభ్యాసమనెడి యోగముతోఁగూడిన, మఱియొకవస్తువును బొందని మనస్సుచే సూర్యమండలమందుఁ బుట్టినపరమ పురుషుని శాస్త్రాచార్యోప దేశమువలన స్మరిం చుచు నాపరమపురుషునే పొందుచున్నాఁడు. అట్టి పరమపురుషుఁడు చేనిఃతోఁ గూడియున్నాఁడనిన చె ప్పుచున్నాను వినుము. సర్వజ్ఞుండును, బురాత నుండును, సకల ప్రపంచకమునకు శిక్షకుండును సూక్ష్మమునకంటెను మిగుల సూక్ష్మమైన వాఁడు ను, సమస్తకర్మఫలజాతములకు వైచిత్ర్యముగాఁ బ్రాణులకొఱకు విభజనకర్తయును, జంతింపనశ క్యమైన రూపముగలవాఁడును, సూర్యుని కాంతి వంటి నిత్యచైతన్య ప్రకాశముగలిగి యజ్ఞానలక్షణ మైన మోహాంధకారమునకంటెను బరముగాను న్నట్టి వాఁడునైన పురుషునిఁ జింతించువాఁడు, అట్టి పురుషునిఁ బొందుచున్నాఁడు. అవసానకాల మునందు నిశ్చలమనస్సుతోడను, భక్తితోడను, యో గబలముచేతను, గూడికొనినవాఁడై కనుబొమల మధ్యమునందుఁ బ్రాణవాయువులను లెస్సగాఁ బ్ర వేశింపఁజేసి యాపరమపురుషుని స్మరించునట్టియో

గి, దివ్యమైన పరమపురుషుని బొందుచున్నాఁడు. వేదార్థమునెఱింగిన వారలేస్థానమును నాశనము లేనిదిగాఁ జెప్పుచున్నారో కోరికలులేక జితేంద్రియులగు సన్న్యాసులేస్థానమును బ్రవేశించుచున్నారో, ఏపదమును గోరుచు బ్రహ్మచర్యము నాచరించుచున్నారో యట్టియక్షరాఖ్యమైన పదమును సంక్షేపముగా నీకుఁజెప్పెదను వినుము. నవద్వారములు లెస్సగా నియమించి హృత్కమలమునందు మనస్సునరికట్టి వశీకృతమైన మనస్సుచేతను హృదయకమలమునకంటె నూర్ధ్వగామియైననాడిచేత నూర్ధ్వమునెక్కించి శిరఃప్రాంతమైన భ్రూమధ్యమునందుఁ దనప్రాణవాయువునుంచి యోగధారణనాశ్రయించినవాఁడై పరమపదమును బొందుచున్నాఁడు. బ్రహ్మవాచకమగు 'ఓం' అనెడు ఏకాక్షరము నుచ్చరించుచున్నవాఁడై, ఆ 'ఓం' కారవాచ్యుఁడనైన నన్నుఁ జింతింపుచు దేహంబుఁద్యజించి పోవునట్టి పురుషుఁడు పరమపదమును బొందును. భగవంతుని బొందుటకు సులభోపాయముం జెప్పెదను వినుము. ఓయర్జున! అన్యవిషయముగానట్టి మనస్సుగలిగి పరమేశ్వరు ని

నన్ను యావజ్జీవమును ప్రతిదినమును జింతించుచు, సర్వదా సమాహిత చిత్తుఁడగు యోగికి నేనుసుల భంబుగఁ బొందశక్యుఁడైన వాఁడను. అన్యునికి సులభుండనుగాను. నీవుసులభసాధ్యుఁఢ వగుటచే నేమియనినఁజెప్పుచున్నాను వినుము. మహాత్ములు నన్నుఁ బొంది యుత్కృష్టమైన మోక్షసిద్ధిని బొం దినవారలై దుఃఖంబులకు నాశ్రయము, నశాశ్వ తమునయిన పునర్జన్మమును బొందరు. ఓయర్జున! బ్రహ్మ లోకంబుతోఁ గూడ సమస్త లోకములు మరలవచ్చెడి స్వభావములు గలిగినవి. ఓపార్థ! నన్నుఁబొందినఁ బునర్జన్మములేదు. * అహోరా త్రములను దెలిసిన జనము చతుర్ముఖ బ్రహ్మకు వేయి యుగములు తుదగాఁగలది పగలనియు, వేయి యుగములు తుదగాఁగలది రాత్రియని యుఁ దెలియుదురు. బ్రహ్మదేవుని పగటి యొ క్క యాగమనకాలమునందు నతనివలన స్థావ రజంగమాత్మక శరీరములు గల సమస్తమైన ప్రజ

* (బ్రహ్మలోకముతోఁ గూడిన సకలలోక ములును ఎందువలనఁ బునరావృత్తిగలవియని శం కించి, కాలనిర్ణయము వలననని చెప్పెను.) ఇచ్చట యీవాక్యము తెచ్చుకొనిన లెస్సగా నర్థమవును.

లుపుట్టుచున్నారు. ఆబ్రహ్మకురాత్రివచ్చిన కాలమునందుఁ బ్రజలు ఆబ్రహ్మదేవునియందే యణఁగుచున్నారు. ఓయర్జున! ఏ ప్రాణి సమూహము పూర్వకల్పమునందుఁ బుట్టెనో అట్టిభూత సమూహమే అస్వతంత్రులై పగలువచ్చిన సమయమునందుఁ బుట్టుచున్నారు. రాత్రివచ్చిన సమయమునందు లీనమగుచున్నారు. ఇట్లు పుట్టి పుట్టి లీనమగుచున్నారు. అట్టిభూత సమూహమునకుఁ గారణభూతుఁడనైన చతుర్ముఖుని కంటెనుత్కృష్టమైనదియు, నన్యమైనదియు, నగోచరమైనదియును, శాశ్వతమైనదియునగు నక్షరపరబ్రహ్మము సమస్త శరీరములు నశించుచుండినను, నశింపదు. ఇంద్రియాగోచరమనియు, నాశరహితమనియుఁ జెప్పఁబడెడు పరబ్రహ్మను బరమపదముగాను జెప్పుచున్నారు. ఏభావమును బొంది జన్మాదులకుఁ దిరుగరో అట్టిస్థానమే యాపరమపదము. ఓయర్జున! ప్రాణులందఱును ఎవనిలో నున్నారో, ఎవనిచే నీ సమస్తజగత్తును వ్యాపింపఁ బడినదో, అట్టిపరమపురుషుఁడు, ఇతరమందాసక్తముగానట్టి భక్తిచేఁ బొందఁ దగినవాఁడగుచున్నాఁడు. ఓయర్జున! ఎట్టి కాలమునందు మరణము జెందిన

కర్మయోగులు పునర్జన్మరాహిత్యమును బొందుదురో, ఎట్టికాలమునందు మరణము చెందిన కర్మయోగులు పునర్జన్మరాహిత్యమును బొందరో అట్టికాలంబులను జెప్పెదనువినుము. అగ్న్యభిమానిదేవతయు, జ్యోతిరభిమాని దేవతయు, దినాభిమానిదేవతయు, శుక్లపక్షాభిమాని దేవతయు, షాణ్మాసాత్మకమైన ఉత్తరాయణాభిమాని దేవతయునై మోక్షమార్గంబగు నుత్తరాయణ కాలమునందుఁ బోయినట్టి బ్రహ్మవేత్తలైన జనులు క్రమముగా బ్రహ్మమును బొంది ముక్తులగుచున్నారు. ధూమాధిదేవతయు రాత్ర్యభిమానిదేవతయుఁ, గృష్ణపక్షాభిమానిదేవతయు, షాణ్మాసాత్మకమైన దక్షిణాయనాభిమానిదేవతయునై కర్మమార్గంబగు దక్షిణాయనకాలమునందుఁ బోయిన కర్మయోగి చంద్ర సంబంధమగునిష్టాపూర్తాది ఫలమును బొంది మరలుచున్నాఁడు. ఉత్తరాయణ దక్షిణాయనములనెడి రెండుమార్గములును, జ్ఞానాజ్ఞాన ప్రకాశములైనవియు, నిత్యములైనవియు, లోకమునకు సమ్మతంబులైనవియునై యున్నవి. ఈమార్గములలో నొకటియగు శుక్లమార్గముచేఁదిరిగి రాకుండుటను బొందుచున్నాఁ

డు. ఇతరమగుఁ గృష్ణమార్గముచే మరలవచ్చుచు
న్నాఁడు. ఓయర్జున! ఈమార్గములను దెలిసిన
యొకానొకయోగి మోసమునొందఁడు. కావున
సమస్తకాలములయందును, నీవుయోగముతోఁ గూ
డినవాఁడవుకమ్ము. వేదములయందును, యజ్ఞ
ములయందున, దపములయందును, దానముల
యందును, ఉపదేశింపఁబడిన సమస్త పుణ్యఫలము
ను, యోగి యతిక్రమించు చున్నాఁడు. ఇంతయే
కాదు, ఈయర్థము నెఱింగి యాదికారణమునగుఁ
బరబ్రహ్మస్థానమును బొందుచున్నాఁడు.

ఇది శ్రీభగవద్గీతా వచనంబను యోగశాస్త్రం
బున శ్రీకృష్ణార్జున సంవాదంబునందు నక్షరప
బ్రహ్మయోగము ఎనిమిదవయధ్యాయము



# తొమ్మిదవయధ్యాయము.

## రాజవిద్యారాజగుహ్యయోగము.



### శ్రీ భ గ వ ద్వా క్య ము.

మిగులగోప్యమైనదియును, అనుభవజన్య జ్ఞానముతోఁ గూడినదియునగు జ్ఞానము నసూయారహితుఁడవగు నీకొఱకు లెస్సగాఁ జెప్పెదను వినుము: అందువలన సంసారమువలన విముక్తుండవు కాఁగలవు. ఉత్తమమై నదియుఁ బవిత్రమై నదియునగు బ్రహ్మము విద్యలయందును రహస్యములయందును శ్రేష్ఠంబయినదియుఁ, బ్రత్యక్షసుఖబోధక మైనదియు, నాశములేనిదియు నైయున్నది. ఓయర్జున! ఇట్టి యాత్మజ్ఞానధర్మమును విశ్వసింపని నాస్తికులు నన్నుఁ బొందక మృత్యురూపమగు సంసార మార్గమునందు నిశ్చయముగా నున్నారు. ఇంద్రియగోచరముగాని స్వరూపముగలనాచే నీజగత్తంతయు వ్యాపింపఁబడెను. సమస్త జీవములు నాయందుండునట్టివి. నేనో ఈభూతముల యం

దుండువాఁడనుగాను. బ్రహ్మాది స్థావరాంతము లగు భూతములు నాయందున్నవిగావు. మఱియే మనిన, నీశ్వరసంబంధమగు నాచాతుర్యముచూడు ము. నాస్వరూపము ప్రాణులరక్షించి వృద్ధిం బొందించునట్టిదైనను భూతములయందున్నది గా దు. అంతటను వ్యాపించియున్నదియు, నధిక మైనదియునగు వాయువునిత్యము నాకాశంబునం దున్న చందంబున సమస్త ప్రాణులు నాయం దున్నవియని తెలిసికొనుము. కల్పాంతమునందు సమస్త ప్రాణులు నామాయను బొందుచున్నవి. నేను సృష్టికాలమునందు నాసర్వభూతములను మ రలఁ బుట్టించుచున్నాను. నామాయనవలంబించి స్వభావముయొక్క యధీనమువలన నస్వతంత్రమైన సమస్త భూతసమూహమును మాటిమాటికిఁ బు ట్టించుచున్నాను. ఓధనంజయ! ఆకర్మములయందు నాసక్తిలేనివాఁడను, నుపేక్షకునివలెనున్నవాఁడను నగునన్ను ఆకర్మములు బంధింపవు. ఓయర్జున! సాక్షిమైననాచే, మాయ, స్థావరజంగములతోఁ గూడిన ప్రపంచమును బుట్టించుచున్నది. ఈసాక్షి త్వనిమిత్తముచే జగత్తువర్తించుచున్నది. ప్రాణినియామకమైనదియు, శ్రేష్ఠమైనదియునగు భావమును

దెలియని మూఢులు, నన్ను మనుష్యదేహము నా శ్రయించిన వానినిగా నవజ్ఞ సేయుచున్నారు. ఓయర్జున! వ్యర్థాశగలవారును, వ్యర్థకర్మములు గలవారును, వ్యర్థజ్ఞానముగల వారునగు మూఢులు హింసారూపమైనదియుఁ, గామదర్పాది బహుళమైనదియు, మోహరూపమై నదియునగు స్వభావము నాశ్రయించినవారలై నన్ను నవజ్ఞ సేయుచున్నారు. ఓ కిరీటీ! అయినను మహాత్ములు దేవతాసంబంధమగు స్వభావమునాశ్రయించి భూతకారణుఁడను, నాశరహితుఁడను, నైననన్నుఁ దెలిసికొని యన్యచింతలేనివారలై భజించుచున్నారు. జితేంద్రియులును, దృఢవ్రతులునైన మఱికొందఱు నిత్యసమాధి చింతనముగలవారలై నన్ను సదాకీర్తనంబుఁ జేయుచు, భక్తిచేనమస్కరించుచు, సేవించుచున్నారు. మఱికొందఱు జ్ఞానమను యజ్ఞముచే నన్నుఁ బూజించుచు సేవించుచునున్నారు. మఱికొందఱొక్కఁడనెడు భావముచేతను, మఱికొందఱు పృథగ్భావముచేతను, మఱికొందఱు బహుప్రకారములుగాను, సంతటను ము *ఖములుగలవానిని గాను సేవించు చున్నారు. జ్యోతిష్టోమాదిక

* వ్యాపకమయిన వాఁడనుట.

ములునేను, స్మార్త కర్మమునేను, పైతృకాన్న మునేను, ఓషధీవికారమునేను, మంత్రమునేను, ఆజ్యాదిహవిస్సు నేనే, అగ్నిహోత్రము నేను, హోమకర్మము నేను, ఈజగత్తునకుఁ దండ్రిని నేనుఁ, దల్లిని నేను, ఫలప్రదుఁడను నేను, దండ్రికిఁ దండ్రి నేను దెలియఁదగినవస్తువు నేను, భావనవస్తువు నేను, ఓంకారము నేను, ఋగ్యజుస్సామ వేదములు నేను; కర్మఫలమును, బోషకుఁడును, స్వామియును, సాక్షియును, నివాసమును, శరణమును, మిత్రుఁడును, ఉత్పత్తియును, స్థితియును, సంహారమును, నిక్షేపమును, నాశములేని బీజమును, నేనే; ఓకురునందన! నేను తపింపఁజేయుచున్నాను, నేను వర్షమునువర్షించుచున్నాను, వర్షమును నిరోధించుచున్నాను; జీవనమును, మృత్యువును, స్థూలమును, సూక్ష్మమును, నేనేయనినన్ను సేవించుచున్నారు. వేదత్రయవేత్తలు సోమపానముసేసి పోఁగొట్టఁబడిన పాపములుగలవారలై యగ్నిష్టోమాది యజ్ఞములచే నన్నుఁబూజించి స్వర్గగమనమునుగోరి యజ్ఞమునుజేయువారు, పుణ్యమగు నింద్రలోకమును బొంది స్వర్గమునందు దివ్యమైన దేవభోగములననుభవించుచున్నారు. అట్టిజనులు విశాలమైన

స్వర్గలోకమున ననుభవించి పుణ్యముక్షయించుచుండ మనుష్యలోకమును బ్రవేశించుచున్నారు. ఇటుల వేదకర్మము నాశ్రయించిన విషయములను గోరెడిజనులు పోవుచు వచ్చుచున్నారు. అస్మదితరోపాసనములేనివారును, నన్నేస్మరించుచున్న వారును, నిత్యసమాహిత చిత్తులైనవారునగు జనులకు నేను యోగక్షేమమును బొందింపుచున్నాను. ఓయర్జున! అన్యదేవతాభక్తులైనవారును, శ్రద్ధతోఁ గూడినవారును, బూజించుచున్నవారును, నగుజనులును మోక్షప్రాపకాభావవిధి పూర్వకంబుగా నన్నే పూజించుచున్నారు. సమస్తశ్రౌతస్మార్త కర్మములకు ననుభవించువాఁడును, స్వామియును నేనేగదా? నన్ను తత్త్వముచే నెఱుఁగనివారు విధిపూర్వకంబైన యాగఫలమువలన జాఱుచున్నారు. దేవతానియమము గలవారలు దేవతలను, పితృవ్రతముగలవారలు పితృదేవతలను, భూతపూజలుగలవారలు వినాయకాది భూతములనుబొందుచున్నారు, నన్నుఁ బూజించు వారలు నన్నే పొందుచున్నారు. భక్తిచేనాకొఱకు, ఆకునైనను, బుష్పమునైనను, ఫలమునైనను, ఉదకమునైననిచ్చునట్టి భక్తునియొక్క భక్తిపూర్వకమునుగా సమ

గ్రింపఁ బడిన యాపత్రాదికమును నేనారగించు చున్నాను. ఓయర్జున! దేనిం జేయుచున్నావో, ఏవస్తువును భుజించుచున్నావో, దేనినివేల్చుచు న్నావో, ఏవస్తువునిచ్చుచున్నావో, దేనినితపస్సు సేయుచున్నావో, దానినినాయందు సమర్పణమైన దానినిగాఁ జేయుము. ఇట్లు త్యాగోపాయ ముతోఁ గూడినయాత్మగలవాఁడవై శుభాశుభఫల ములు గలిగి పుణ్యాపాపములనెడి కర్మబంధముల చేవిడువఁబడిన కర్మవిముక్తుండవై నన్నుఁ బొంద గలవు. నేను సమస్త ప్రాణులయందును, సముఁ డును, నాకప్రియుఁడును, ప్రియుఁడును లేఁడు; నన్ను భక్తితో భజించు భక్తులు నాయందున్నారు. నే నును ఆభక్తులయందున్నాను. మిగుల నిందితాచా రముగలవాఁడైనను నాకంటెనితరదేవతను భజన సేయునివాఁడై నన్నుసేవించుచున్న వాఁడాయె నేని యతఁడు సదాచారముగల వాఁడేయని తెలియఁ దగినవాఁడు, కావున వాఁడు లెస్సగా మోక్షము కొఱకునుద్యోగించినవాఁడగుచున్నాఁడు. అట్టిపురు షుఁడు శీఘ్రముగా ధర్మమునందు మనస్సుగలవాఁ డగుచున్నాఁడు. నిత్యమును శాంతినిఁ బొందుచు న్నాఁడు. ఓయర్జున! నాభక్తుఁడు నశింపఁడని

ప్రతిజ్ఞ చేయుము. ఓకౌంతేయా! నికృష్టజన్మము లుగలవారలగు స్త్రీలును, వైశ్యులును, శూద్రులును, నన్నాశ్రయించి శ్రేష్ఠమైనగతినిఁ బొందుచున్నారు గదా? పుణ్యులును భజనశీలురును నైన బ్రాహ్మణులును, రాజర్షులును నుత్కృష్టగతినిఁ బొందుదురని యేల చెప్పవలయును? క్షణభంగురమయినదియును, సుఖవర్జితమయి నదియునగు నీ లోకమునుబొంది నన్ను సేవింపుము. నాయందు మనస్సుగలవాఁడవును నాకు సేవకుఁడవును, నన్నుఁ బూజించువాఁడవునుగమ్మా: నన్నుఁగూర్చి నమస్కరింపుము. ఇట్లు నాయందుఁ బ్రీతిగలవాఁడవై మనస్సును నాయందుంచిన, నన్నే పొందఁగలవు.

ఇది శ్రీభగవద్గీతా వచనంబను యోగశాస్త్రంబున శ్రీకృష్ణార్జున సంవాదంబునందు రాజవిద్యా రాజగుహ్యయోగము తొమ్మిదవయధ్యాయము.



# పదియవయధ్యాయము.



## విభూతియోగము.



### శ్రీ భ గ వ ద్వా క్య ము.

ఓయర్జున! సంతసించుచున్న నీకొఱకు నేను హితము సేయునిచ్ఛచేతను మరల నుత్కృష్టమయిన వాక్యముచెప్పెదను.వినుము. భృగ్వాది మహర్షులు నాప్రభుశక్త్యతిశయమును దెలియరు; దేవసమూహమును, నెఱుంగరు. నేను దేవతలకును, మహర్షులకును, సర్వప్రకారములచే మొదటివాఁడను. ఆదిలేనివాఁడను, పుట్టువులేనివాఁడను, లోకంబులకు నియామకుండనైన నన్నుఁదెలియు మానవులయందు మోహవర్జితుండయినవాఁడు సమస్త పాపములచే విడువంబడును. బుద్ధియును, జ్ఞానమును, మోహరాహిత్యమును, ఓర్పును, సత్యమును, బాహ్యేంద్రియ నిగ్రహంబును, నంతరింద్రియనిగ్రహంబును, సుఖమును, సంతాపంబును,

నుత్పత్తియును, నాశనమును, భయాభయములును, ప్రాణిహింసలేక పోవుటయు, సమచిత్తతయును, సంతోషంబును, దపస్సును, దానంబును, గీర్తియు, నపకీర్తియునని ప్రాణులకు నిట్లు నానావిధము లగు భావములు నావలననే గలుగుచున్నవి. పూర్వ కాలసంబంధులగు సప్తమహర్షులును, నలువురగు సనకాదులును, స్వాయంభువాది మనువులును, మ ద్గతభావనులై మనస్సుచేఁ బుట్టింపఁబడిరి. వీరి వలన లోకమునందు నీచరాచర రూపములయిన ప్రజలుపుట్టిరి. నావిభూతియును, యోగమును, యథార్థముగాఁ దెలియువాఁడుచలింపనట్టి యోగ ముచేఁ గూర్పఁబడును. ఈయర్థమునందు సం శయములేదు. నేను సమస్తజగత్తుకు నుత్పత్తికార ణమయినవాఁడను, నావలనసర్వము ప్రవర్తించు చున్నదని యెంచి నాభావముతోఁ గూడినవార లయి నన్నుసేవించుచున్నారు. నాయందుమనస్సు గలవారలు నన్నుఁ బొందిన ప్రాణములు గలవా రలును, నన్యోన్యముగానన్నుఁ దెలియఁజేసి కొనుచు న్నవారలును,నన్నుఁ గీర్తింపుచున్నవారలును, నెల్ల ప్పుడును నన్ను సంతోషింపఁ జేయుచున్నవారలు నునై క్రీడించుచున్నారు. నిత్యయుక్తులయిన నార

లును, విశ్వాసపూర్వకముగా సేవింపుచున్న వారలునైన మానవులకు, అట్టిజ్ఞానయోగము నిచ్చుచున్నాను; అట్టిబుద్ధియోగముచేనారలు నన్నుఁ బొందుచున్నారు. వారలకే, దయచేయ స్వాభిప్రాయమునందున్న నేను ప్రకాశించుచున్న జ్ఞానమనెడి దీపముచే నజ్ఞానమనెడి యంధకారమును నశింపఁజేయుచున్నాను.

## అర్జునునివాక్యము.

నీవు పరబ్రహ్మమవు, పరంధామమవు, పరమపవిత్రమవు; ఇదియునుంగాక, నిన్నుఁ బురుషునిఁగాను, శాశ్వతమైనవానినిగాను, ప్రకాశించుచున్నవానినిగాను, దేవతలలో మొదటి వానినిగాను, బుట్టువులేనివానినిగాను, ప్రభువునుగాను, దేవర్షి యగునారదుండును, నసితుండైన దేవలుండును. వేదవ్యాసుండును, వసిష్ఠాది ఋషులును, జెప్పుదురు. నీవునాకొఱకుఁ జెప్పుచున్నావు. ఓకేశవ! నన్నుఁ గూర్చి చెప్పుచున్న సమస్తమును సత్యమయిన దానినిగాఁ దలంచుచున్నాను. ఓకృష్ణ! దేవతలును రాక్షసులును నీమహిమ నెఱుంగరు

గదా? ప్రాణులవృద్ధిఁ బొందించు వాఁడవును, బ్రాణులకు నియామకుఁడవును, దేవతలకు దేవుండవును, నైనయోపురుషోత్తమ! నీవు, నీచేగురూపదేశాపేక్షలేకనే నీవే నిన్నెఱుంగుచున్నావు. స్వకీయమయిన మాహాత్మ్యవిస్తారములు ప్రకాశించుచున్నవిగదా? ఏమాహాత్మ్యవిస్తారములచే నీలోకమును నీవువ్యాపించియున్నావో, ఆమాహాత్మ్యవిస్తారములను నిశ్శేషముగాఁ జెప్పఁదగుదువు. ఓకృష్ణ! నేనెటుల నిన్ను సదాధ్యానము సేయుచున్నవాఁడనయి తెలియుదును? ఓకృష్ణ! ఏయేవస్తువులయందు నాచే ధ్యానము సేయఁదగినవాఁడవగుచున్నావు. ఓజనార్దన! నీయోగమును, నైశ్వర్యమును, సవిస్తారముగా మరలఁజెప్పుము. నీయమృత వాక్యములను వినుచున్న నాకుఁ దృప్తి లేదుగదా?

## శ్రీభగవద్వాక్యము-

ఓయర్జున! ఓయి!! ప్రకాశించుచున్నస్వకీయమైన మాహాత్మ్యవిస్తారమును ముఖ్యముగా నీకొఱకుఁ జెప్పఁగలను, నామాత్మ్యవిస్తారమునకుఁదుదలేదు గదా? నేను సమస్తప్రాణుల హృదయ

మునందు ధ్యానము సేయందగినవాఁడను, పరమాత్మస్వరూపుండ నగుదు. నేను ప్రాణులకు నాదికారణంబును, స్థితియును, నాశమును, ద్వాదశాదిత్యులలో విష్ణువను నాదిత్యుండును నగుదు. జ్యోతిష్కులలోఁ గిరణములుగల సూర్యుండు నేను. వాయువులలో మరీచియనెడి వాయువు నేనగుచున్నాను. నక్షత్రములలో చంద్రుండు నేను, వేదములలో సామవేదము నేను. దేవతలలో నింద్రుండు నేను, ఇంద్రియములలో మనస్సు నేనగుచున్నాను. ప్రాణులకు సాక్షిచైతన్యము నేనగుచున్నాను. ఏకాదశరుద్రులలో శంకరుండు నేను. యక్షరాక్షసులలోఁ గుబేరుండు నేను. అష్టవసువులలో నగ్నియును, బర్వతములలో మేరుపర్వతమును, నేనగుచున్నాను. ఓయర్జున! పురోహితములలోఁ బ్రధానుఁడైన బృహస్పతి నేను. సేనానాయకులలోఁ గుమారస్వామి నేను. దేవఖాతసరస్సులలో సముద్రుఁడు నేనగుచున్నాను. మహర్షులలో భృగుమహర్షి నేను. ధ్వను*లలో నేకమయిన ఓంకారాక్షరము నేనగుచున్నాను. యజ్ఞములలో జపయజ్ఞము నేనగుచున్నాను. స్థావరము

* వాక్కులనుట.

లలో హిమవత్పర్వతము నేనగుచున్నాను. సమస్త వృక్షములలో నశ్వత్థవృక్షమును, దేవర్షులలో నారదుండును గంధర్వులలోఁ జిత్రరథుండును, సిద్ధులలోఁ గపిలమహామునీశ్వరుండును, నేనగుచున్నాను, గుఱ్ఱములలో నమృతముతోఁ బుట్టిన నుచ్చైశ్శ్రవమును, గజశ్రేష్ఠములలో నైరావతమును, మనుష్యులలో రాజును నన్నుఁగాఁ దెలియుము. ఆయుధములలో వజ్రాయుధమును, ధేనువులలోఁ గామధేనువును, నేనగుచున్నాను. ప్రాణులఁ బుట్టించునట్టి మన్మథుండు నేనగుచున్నాను. సాధారణ సర్పములలో వాసుకియనెడి సర్పరాజునగుచున్నాను. నాగసర్పములలో ననంతుండను నాగరాజు నేనగుచున్నాను. జల దేవతలలో వరుణుండు నేను. పితృదేవతలలో నర్యముఁడను దేవత నేను దండించువారలలో యముండను నేను దైత్యులలో ప్రహ్లాదుఁడనగుచున్నాను. లెక్కించువారలలోఁ గాలము నేను, మృగములలో సింహము నేను. పక్షులలో గరుత్మంతుఁడు నేను. పరిశుద్ధ కరములలో వాయువు నేను. ధనుర్ధరులలో శ్రీరాముఁడు నేను; మత్స్యములలో మొసలి నేను; నదులలో గంగను నేను. సృష్టులకు మొదలును మధ్యమును, దు

యునునేను, విద్యలలో నధ్యా *త్మ విద్యనేను. వాదించెడివారల తర్కవాదమునేను. అక్షరములలో, అవర్ణమునేనగుచున్నాను. సమాససముదాయములలో ద్వంద్వసమాసము నేను. నాశనము లేనట్టికాలమునేను. కర్మఫల దాయకుండయిన చతుర్ముఖబ్రహ్మనేను. సమస్తనాశకరమైన మృత్యుదేవతను, ఉత్పత్తికాఁగలవారి పుట్టుకునేను. స్త్రీలలోఁగీర్తియు, లక్ష్మియు, వాక్కును, స్మృతియును, బుద్ధియును, ధైర్యమును, ఓర్పును, నేను. సామములలో బృహత్సామమును, ఛందస్సులలో గాయత్రీ ఛందస్సునేను. మాసములలో మార్గశీర్షమునేను. ఋతువులలో వసంతఋతువునేను. వంచనపరులయినవారి జూదమునేనగుచున్నాను. తేజోవంతుల తేజస్సునేను. సాత్త్వికుల సత్త్వగుణమును, జయమును, నుద్యోగమును నేను. యాదవులలో వాసుదేవుండనైన వాసుదేవను; పాండవులలో ధనంజయుండనయిన నేను నేనే; మునులలో వ్యాసుండనునేను. కవులలో భార్గవుండనుగవి నేను. దండించువారల దండము నేనగుచున్నాను. జయింప నిచ్ఛగలవారల జయో

---

* మోక్షవిద్యయనుట.

పాయనీతి నేనగుచున్నాను. గోప్యములలో మౌ
నము నేనగుచున్నాను. జ్ఞానవంతులజ్ఞానము నేను.
ఓయర్జున! సమస్త భూతములకును బీజము నేను.
జంగమ స్థావరాత్మకమయిన ప్రాణిసమూహము
న నాకంటెనితరము నేదియునులేదు. ఓయర్జున!
ప్రకాశించుచున్న నామాహాత్మ్య విస్తారములకుఁ
దుదలేదు. ఈవిభూతివిస్తారము నాచే సంక్షే
పముగాఁ జెప్పంబడెను. లోకమునందు నైశ్వర్య
యుక్తమయినదియుఁ, గాంతియుక్తమయనదియు,
నుత్సాహముతోఁ గూడినదియు, నైనయేవస్తువు
గలదో యావస్తువును నాతేజోభాగ సంబంధమ
యినదానినిగాఁ దెలిసికొనుము. ఓయర్జున! అటు
కాకపోయెనేని, ఈచెప్పఁబడిన అధికమయినజ్ఞాన
ముతో నీకేమిప్రయోజనము? శేషములేకుండునటుల
ఈచెప్పఁబడిన దానినే చెప్పుచున్నాను వినుము.
నేనొకపాదముచే సమస్తమయిన యీజగత్తును,
విశేషముగా సర్వభూతస్వరూపముతో వ్యాపించి
యున్నాను.

ఇది శ్రీభగవద్గీతా వచనంబను యోగశాస్త్రం
బున శ్రీకృష్ణార్జున సంవాదంబునందు విభూతి
యోగము పదియవయధ్యాయము.

పదునొకొండవయధ్యాయము.



# వి శ్వ రూ ప స ం ద ర్శ న యో గ ము.



## అర్జునునివాక్యము.

ఓయచ్యుత! గ్రహించుటకు శ్రేష్ఠమయిన దియును, గోప్యమయి నదియును, నాత్మా నాత్మవస్తు వివేచనమయినదియునగు నీవాక్యముచే నాయజ్ఞానము పోఁగొట్టఁబడెను. ఓకమలపత్రా క్షా! నీవలనఁ బ్రాణుల యుత్పత్తి ప్రళయములు సవిస్తరముగానాచే వినఁబడెను. అక్షయమయిన నీమాహాత్మ్యమువినఁబడెను. ఓపరమేశ్వర! ఓ పురుషోత్తమ!! నీవునిన్నుఁ గూర్చి యేప్రకా రముగాఁ జెప్పుచున్నావో, అదియాలాగుననే; అందునకు వ్యత్యాసములేదు. నీచేఁజెప్పఁబడిన యీశ్వరసంబంధమగు నీస్వరూపమును జూడనిచ్ఛ యించుచున్నాను. ఓప్రభూ! ఓయోగీశ్వర!! అట్టి

రూపమునేఁ జూడశక్యమయినదిగాఁ దలంచితివేని నీవు నాకొఱకు నీ శాశ్వతమయిన రూపమును జూపుము.

## శ్రీభగవద్వాక్యము.

ఓయర్జున! నానావిధములగు దివ్యములయిన నానావర్ణములును, విశేషములునుగల నాయాకారములను, అనేకప్రకారములఁ జూడుము. ఓయర్జున! ద్వాదశాదిత్యులును, అష్టవసులును, ఏకాదశరుద్రులు, అశ్వినీదేవతలును, సప్తనాయువులును, జూడుము. ఎన్నడును జూడంబడని బహ్వాశ్చర్యములను జూడుము. ఓకౌంతేయ! ఇప్పుడుజంగమస్థావరములతోఁ గూడిన సమస్తజగత్తును, నాయీ శరీరమందొక ప్రదేశమందున్న దానినిగాఁ జూడుము. అన్యమయిన దేనినిజూడ నిశ్చయించుచున్నావో దానినిజూడుము. ఇట్లు నీ నేత్రములచే నన్నుఁజూడ నశక్తుఁడవౌదువు; కావున, నీకొఱకు దివ్యదృష్టినిచ్చుచున్నాను. ఈశ్వర సంబంధమగు నాశక్తినిఁ జూడుము.

## సంజయునివాక్యము.

ఓధృతరాష్ట్రా! మహాయోగములకును బ్రభువయిన శ్రీకృష్ణస్వామి, ఈ ప్రకారముగాఁ బలికి అటువెనుక నర్జునునికొఱకు శ్రేష్ఠమయి నదియు, నీశ్వరసంబంధమయినదియునగు విశ్వ రూపమును జూపెను. అనేక ముఖములును, నేత్రములును, గలిగి బహువిధములగు నాశ్చర్యములను జూపుచున్న యనేకదివ్యభూషణములు గలిగినదియు, దివ్యములై యెత్తఁబడియున్న యనేకాయుధములు గలిగినదియు నగు. రూపమును జూపెను. దివ్యములయినమాల్యములను, వస్త్రములను ధరించియున్నవాఁడును, దివ్యగంధానులేపనముగల వాఁడును, సర్వాశ్చర్యరూపమయినవాఁడును, అంతటను ముఖములు గలవాఁడును, అనంతమయినవాఁడును, నగునాదేవుని నర్జునుండు చూచెను. ఆకసమునందు సహస్ర సూర్యులకాంతి ఏకకాలమునందెగసినదామెనేని అట్టికాంతి యామహాత్మునికాంతికి సమానమయినది యగును. బహుప్రకారములుగా నేర్పఱుపఁబడిన నీజగత్తంతయు, శ్రీకృష్ణస్వామియొక్క ఆశరీరమునందు నొకప్రక్కనున్నదానినిగాఁ నప్పుడర్జునుండు చూచెను, అనం

తరమునందర్జునుం డాశ్చర్యముతోఁ గూడినవాఁడును, గగుర్పాటుగలిగిన వెంట్రుకలుగలవాఁడునయి, విశ్వరూపధరుండగు శ్రీకృష్ణస్వామిని శిరస్సుచే నమస్కరించి, బద్ధాంజలియై, యిటులఁ బలికెను. ఓదేవ! నీదేహమునందు దేవతలను, అటులనే సమస్త ప్రాణికోటులను, కమలాసనుండైన చతుర్ముఖబ్రహ్మను, సమస్త ఋషులను, దివ్యములయిన వాసుకిమొదలగు సర్పముల్లను, జూచుచున్నాను. విశ్వనియామకుఁడవు, విశ్వరూపధరుఁడవు, నగు నోస్వామి! అనేకబాహువులు, నుదరములును, ముఖములును, నేత్రములును గలిగిన నిన్ను నంతట ననంతరూపములుగల వానినిగాఁ జూచుచున్నాను. అయినను నీయాది మధ్యాంతములుగానను. కిరీటము గలవాఁడును, గదగలవాఁడును, జక్రముగలవాఁడును, గాంతిపుంజము గనుక నంతటను బ్రకాశముఁగలవాఁడును, గష్టముచేఁ జూడ శక్యుఁడైనవాఁడును, బ్రకాశించుచున్న యగ్నిసూర్యులకాంతివంటి కాంతిగల వాఁడును. అపరిచ్ఛేద్యుఁడైనవాఁడవగు నిన్నంతటను జూచుచున్నాను. నీవు పరబ్రహ్మమని తెలియఁదగినవాఁడవును, ఈ ప్రపంచకమునకుఁ బరమాశ్రయమయినవాఁడవును.

నాశనరహితుండవును, శాశ్వతధర్మరక్షకుండవును, పురాణపురుషుండవునని నామతము. ఆదిమధ్యాంతములు లేనివాఁడును, ననంతవీర్యము గలవాఁడును, ననంతబాహువులు గలిగినవాఁడును, జంద్రసూర్యులే నేత్రములుగాఁ గలవాఁడును, బ్రకాశించుచున్న యగ్నివంటిముఖములు గలవాఁడును నయిన నిన్నునిజతేజముచే నీప్రపంచమును, దపింపఁజేయుచున్నవానినిగాఁ జూచుచున్నాను. ఒక్కఁడవయిననీచే భూమ్యాకాశముల యంతరమువ్యాపింపఁబడెను, సమస్తదిక్కులును వ్యాపింపఁబడినవి. ఓమహాత్మా! అద్భుతమయినదియు, నుగ్రమయినదియు, నగునీయీరూపమును, జూచి మూల్లోకములును భయపడుచున్నవి. ఈయుద్ధభూమికి వచ్చియున్న భూభారనివారణ కొఱకు మర్త్యులయి పుట్టియున్న వస్వాదిదేవసమూహములు నీయందుఁ గనుబడుచున్నవి. వారిలోఁ గొందఱుభయపడి బద్ధాంజలులయి నుతించుచున్నారు. మహర్షిసమూహములు క్షేమమగుఁగాక యని పలికి సంపూర్ణములైన స్తోత్రములచే నిన్ను స్తోత్రము చేయుచున్నవి. ఏకాదశ రుద్రులును,

ద్వాదశాదిత్యులును, అష్టవసువులును, సాధ్యులును, విశ్వేదేవతలును, అశ్వినీదేవతలును, మరుత్తులును, పితృదేవతలును, గంధర్వయక్షరాక్షస సిద్ధసమూహములు నను వీరందఱు నాశ్చర్యమును బొందిన వారైనిన్నే చూచుచున్నారు. ఓస్వామి! అనేక ముఖములును, నేత్రములును గలిగినదియు, ననేక బాహువులును, తొడలును, పాదములును, గలిగినదియు, పెక్కుకడుపులు గలిగినదియు, పెక్కుకోఱలచే భయంకరమయి నదియు, నధికమయి నదియునగు నీయాకారమును జూచి ప్రాణులు భయపడుచున్నారు? అటులనే నేనునుభయపడుచున్నాను. ఓవిష్ణువా! ఆకసమును దాఁకుచున్న వాఁడును, మండుచున్నవాఁడును, ననేకవర్ణములు గలవాఁడును, తెరవఁబడినముఖములు గలవాఁడును, ప్రకాశించుచున్న గొప్పకన్నులుగలవాఁడును, నగు నిన్నుఁజూచిభయఁపడిన మనస్సుగలవాఁడనై ధైర్యమును బొందకున్నాను; మనస్తుష్టిని బొందకున్నాను; కోఱలచేభయంకరములయి, ప్రళయాగ్నిసమానములయిన నీముఖములను జూచి దిక్కులను తెలియకున్నాను; సుఖమును బొందకున్నాను. ఓజగన్నివాస! ఓదేవదేవ!! నీవుప్రసన్నుం

డ వగుము. భూపాల సమూహ ములతోఁ గూడిన యీధార్తరాష్ట్రులందఱును, భీష్మద్రోణు లును, కర్ణుఁడును, నాసంబంధులగు ద్రుష్టద్యుమ్నుఁడు మొదలుగాఁగల యోధాగ్రేసరుల తోడ నిన్నుఁ బ్రవేశించుచున్నారు. ఈ దుర్యోధనాదు లుత్తరతోఁ గూడినవారలయి, కోఱలచేవికృతము లయి, భయంకరములయిన నీముఖములను బ్రవే శించుచున్నారు. వారలలోఁ గొందఱు దంత ముల సందులయందుఁ జిక్కినవారయి చూర్ణ ముగాఁజేయఁ బడిన శిరస్సులతోఁ గూఁడగనఁ బడుచున్నారు. అనేకనదుల యుదక వేగములు సముద్రమునకు నధోముఖములయినవయి సముద్ర మునే యెట్లు ప్రవేశించుచున్నవో, ఆప్రకారమే యీశూరులంతటను బ్రకాశించుచున్న నీముఖము లను బ్రవేశించుచున్నారు. మిడతలు నాశము కొఱకు నధికవేగముతో మండుచుండెడి యగ్ని బ్రవేశించునటులఁ బ్రాణులధికమయిన వేగము గలవారలయి నాశము కొఱకు నీముఖము బ్రవే శించుచున్నారు. మండుచున్న ముఖములచే సమస్త జనులను మ్రింగుచున్నవాఁడవయి యంతటను నా స్వాదించుచున్నావు. ఓవిష్ణువా! భయంకరము

లయిన నీదగుఁగాంతులు తేజస్సులచే జగత్త్రం
తయునిండి తపింపఁ జేయుచున్నవి. ఓదేవశ్రే
ష్ఠుఁడ! నీకు నమస్కారమగుఁగాక. నాకుఁ బ్రస
న్నుఁడవగుము. నేను నీవ్యాపారమును గుర్తె
ఱుంగను. ఉగ్రరూపముగల నీవెవఁడవు, ఆద్యుఁ
డవైన నిన్ను నేను తెలియఁ గోరుచున్నాను;
నాకుఁ జెప్పుము.

## శ్రీభగవద్వాక్యము.

లోకనాశకరమయినదియుఁ, బ్రబలమయిన
దియు నగుఁ గాలమునేనగుచున్నాను. లోకము
లను సంహరింప, నికాలమునందు నుద్యో
గించినవాఁడనగుచున్నాను. ప్రతిసేనల యందును,
బ్రతిపక్షుల యుద్ధము సేయువారందఱును ఎవ్వ
రును బ్రతుకఁజాలరు. ఆకారణమువలన యుద్ధ
మునకులెమ్ము. దుర్యోధనాదుల గెలిచి కీర్తిం
బొందుము. సమృద్ధమయిన రాజ్యము ననుభవిం
పుము. ఈనీపగవారలు పూర్వమేనాచేఁ జంపఁ
బడిరి. ఓయర్జున! నీవునిమిత్త మాత్రమగుము.
ద్రోణాచార్యుని, భీష్ముని, జయద్రథుని, కర్ణుని,

అటులనే పూర్వమే నాచేఁ జంపఁబడిన యస్య యోధవీరులను, గెలువుము; భయపడకుము; యుద్ధ ముసేయుము; యుద్ధమునందు శత్రువులను గెల్చువా గలవు.

సంజయునివాక్యము.

వణుకుచున్నయర్జునుండు శ్రీకృష్ణునివాక్య మును విని నమస్కరించి ముకుళితహస్తుండై మాటి మాటికిని భయపడుచు నతనిఁగూర్చి తిరిగియు నమ్రుఁడై తొట్రుపాటుతోఁ గూడునటులఁ బలి కెను. ఓహృషీకేశ! నీకీర్తనముచే జగత్తు సంతో షించుచున్నదనునది యేదిగలదో యదియును, జగత్తనురాగముఁబొందుచున్నది యేదిగలదో యదియు ను, రాక్షసులు భయపడినవారలయి దిశలను గూర్చి పరుగిడుచున్నారనునది యేది గలదో యదియును, సమస్తసిద్ధసమూహములు నమస్క రించుచున్నారనునది యేది గలదో యదియును యుక్తమే కదా? ఓమహానుభావ! శ్రేష్ఠుఁడగు బ్రహ్మదేవునికి నాదికర్తవైన నీకు నెందువలన నమస్కరింపకుందురు? అనంతుఁడవును, దేవదే వుండవును, జగత్తునకాధారభూతుండవునైన

యోస్వామీ! నాశము లేనట్టిదియును, ఉన్నట్టి దియును, నగు నా రెండింటికిఁ బరమయినది యేది గలదో యదినీవేయగుచున్నావు. ఓయనంతరూప! నీవు ఆదిదేవుండవును, బురాణ పురుషుండవును, ఈ జగత్తునకు శ్రేష్ఠమగునాధారభూతుఁడవును దెలిసిన వాఁడవునయితివి. తెలియందగిన పరంధామము నీవే. నీచేఁ బ్రపంచము వ్యాపింపఁ బడెను. వాయువును, యముఁడును, నగ్నియును, వరుణుండును, జంద్రుఁడును, బ్రహ్మదేవుండును. బ్రహ్మకుఁ దండ్రియును, నీవే; అందువలన నీకువేయావృత్తులు నమస్కారము; మరల మరలనమస్కారము. ఓకృష్ణస్వామీ! ముందఱను, అనంతరము నందును, వెనుకను, సర్వదిక్కులయందును, నమస్కారము నీకగుఁగాక. అమితసామర్థ్యపరాక్రమములుగల నీవు సర్వమును లెస్సగా వ్యాపించియున్నావు; అందువలన సర్వస్వరూపుఁడవయితివి. నీవిశ్వరూపమును, నీమహిమయును దెలియక, అజ్ఞానముచేతను, బరిచయముచేతను, నా స్నేహితుఁడవని తలంచి ఓకృష్ణ! ఓసఖుఁడా! యని బలాత్కారముగాఁ బలుకఁబడిన వాక్యములనుక్షమింపుము. ఓయచ్యుత! అపహాస్యము కొ

ఒకు విహారణశయనాసన భోజనకాలములయందుఁ దిరస్కరింపఁబడిన వాఁడవై తివనునదియు, మఱియును, బరోక్షమయిన వాఁడవై తత్ప్రత్యక్షమందును దిరస్కరింపఁ బడినవాఁడవైతివను నదియునగు నట్టియపరాధములను నప్రమేయుండవైననిన్ను నేనుక్షమింపఁ జేయునటులఁ గోరుచున్నాను. అసమానమైన స్వభావముగల యోస్వామీ! నీవుచరాచరాత్మకమయిన యీ ప్రాణిసమూహమునకుఁదండ్రియుఁ, బూజార్హుఁడును, బరమగురువునైతివి. అందువలన ముల్లోకముల యందును నీకు సమునుఁడులేఁడు, అన్యుఁడెక్కడినాఁడు. అకారణమువలన శరీరమును బడవేసి నమస్కరించి, యీశ్వరుండైనవాఁడును స్తోత్రార్హుఁడును నయిన నిన్నుఁ బ్రసన్నునిగాఁ జేసికొందును. ఓదేవ! కుమారుని యపరాధమును దండ్రివలెను, జెలికానియపరాధమును జెలికానివలెను, బ్రియురాలి యపరాధమును బ్రియునివలెను, నాయపరాధము నీవు సహింపఁ దగుదువు. ఓదేవ! ఒకప్పుడును జూడంబడని విశ్వరూపమును జూచి సంతోషించినవాఁడనైతిని, నా మనస్సు భయముచే మిక్కిలి చలింపఁ బడినది.

ఆపూర్వరూపమునే నాకుఁ జూపుము. ఓదేవదేవ! ఓజగన్నివాస!! నాకుఁ బ్రసన్నుఁడవగుము సహస్ర భుజములుగల విశ్వరూప ధరుఁడవైన యోస్వామీ! నిన్ను కిరీటము, గదయును, జక్రమును హస్తమునందుఁ గల వానినిగాను జూడఁగోరుచున్నాను. కావున చతుర్భుజములుగల యాపూర్వరూపముతోఁ గూడినవాఁడవుకమ్ము.

## శ్రీభగవద్వాక్యము.

ఓయర్జున! నా తేజస్స్వరూప మయినదియు, నానందమయినదియు, నాదియైనదియు, నీకంటె నితరునిచేఁ బూర్వము చూడఁ బడనిదియు, శ్రేష్ఠ మయినదియు నయిన యీవిశ్వరూపము, ప్రసన్నుఁడైన నాచే నాత్మయోగ సామర్థ్యమువలన నీకుఁ జూపఁ బడెను. ఓయర్జున! ఈవిశ్వరూపముగల నేనుమానవ లోకమునందు నీకంటెనితరునిచే వేద యజ్ఞాధ్యయనములచేతను, దానములచేతను, క్రియలచేతను, నుగ్రతపస్సులచేతను జూడ శక్యుండను గాను. ఇట్టి ఘోరంబగు నారూపమును జూచి భయమును, మూఢభావమును నీకువలదు. నీవు

భయములేనివాఁడవును, సంతోష మనస్కుఁడవు నగునై మరల నాపూర్వరూపమునే జూడుము.

సంజయునివాక్యము.

ఇట్లని పలికి, అప్పుడర్జునునికి శ్రీకృష్ణస్వామి మరలఁ దనదగుఁ బూర్వ రూపమును జూపెను. శ్రీకృష్ణస్వామి సౌమ్యరూపము గలవాఁడై భయపడినయర్జునుని మరల నూరడించెను.

అర్జునునివాక్యము.

ఓజనార్దన! ప్రసన్నమయినదియు, మనుష్య సంబంధ మయినదియు, నగు నీయాకారమును జూచి యిప్పుడు నెమ్మదిని బొందిన వాఁడను, చైతన్యముతోఁ గూడినవాఁడను, స్వభావమును బొందినవాఁడనై తిని.

శ్రీభగవద్వాక్యము.

నీచేఁజూడఁ బడినదియుఁ, జూడమిగుల నశక్యమయినదియు, నగునీవిశ్వరూపమును దేవతలు

ను నిత్యముఁ జూడఁ గోరుచుందురు. నన్ను నీవు చూచిన విధములుగల యిట్టి విశ్వ రూపమును ధరించిననేను, వేదములచేతను, దపస్సులచేతను, దానములచేతను, యజ్ఞములచేతను, జూడశక్యుం డనుగాను. ఓయర్జున! ఇతరాసక్తముగాని భక్తిచే నిట్టి విశ్వరూపమును ధరించిన నేనుతత్త్వము చేఁ దెలియుటకును, జూచుటకును, మోక్షముఁ బొందుటకును శక్యమయిన వాఁడనుగాను. ఓయర్జున! నాకొఱకు, సత్కర్మచేయువాఁడును, నేనే యుత్కృష్టగతి గాఁగలవాఁడును, నన్నే సర్వప్రకారములచే భజించువాఁడును, ధనబంధు పుత్రమిత్ర కళత్రాది సంగములచే విడువంబడిన వాఁడును, సమస్త ప్రాణులయందు వైరములేనివాఁడును నగుమానవుఁడు నన్నుఁబొందుచున్నాఁడు.

ఇది శ్రీభగవద్గీతా వచనంబను. యోగశాస్త్రంబున శ్రీకృష్ణార్జున సంవాదంబునందు విశ్వరూపసందర్శనయోగము పదునొకొండవయధ్యాయము.



# పండ్రెండవయధ్యాయము.



## భక్తియోగము.



### అర్జునునివాక్యము.

ఓ కేశవ! నిరంతరమీప్రకారము భగవత్కా
ర్యములయందు సమాహితులయిన భక్తులునిన్ను
ధ్యానముసేయుచున్నారు. మఱికొందఱు ఇంద్రి
యాగోచరమయిన బ్రహ్మమును ధ్యానముసేయు
చున్నారు. వీరలయందు మిగులయోగము తెలి
సిన వారలెవ్వరు?

### శ్రీ భ గ వ ద్వా క్య ము.

ఓయర్జున! నాయందు మనస్సునుంచి నిరం
తరము సమాహితచిత్తులయి మిగుల శ్రద్ధతోడను

నన్ను ధ్యానించు భక్తులు మిక్కిలి యుక్తులగు చున్నారు. కావునవారు నాకునిష్టులు. నాశ రహితమయినదియు, నిర్దేశింపఁ గూడనిదియు, రూపాది రహితమయినదియు, నంతటవ్యాపించి యున్నదియు ధ్యానింపఁగూడనిదియుఁ, బ్రకృతి యందున్నదియుఁ, జలింపనదియు, నిత్యమైనదియు, నయిన యాబ్రహ్మమును నుపాసించి యింద్రియ సమూహమును లెస్సగా నిగ్రహించి సమస్త కాలములయందును సమబుద్ధిగలవారును సమస్త ప్రాణి హితమునందా సక్తమయిన చిత్తముగల వారును, నన్నే పొందుచున్నారు. అయినను వారలకుఁ గష్టము మిగుల నధికమైయున్నది. ఆ కారణమువలన దేహాభిమానము గల వారలచే నక్షరస్వరూపమయిన మార్గము దుఃఖమునగునటులఁ బొందబడుచున్నది. నేనేపరమగతిగాఁ గలవార లయి సమస్తకర్మములను నాయందు సమర్పించి నాకంటె నితరాలంబనములేనట్టిసమాధి చేతనే నన్ను ధ్యానము సేయువారలయి యెవరు సే వించుచున్నారో, ఓయర్జున! అట్టినాయందుంపఁబడిన చిత్తముగలవారలకు మృత్యురూపమయిన సంసా రమనెడి సముద్రమునుండి నేను శీఘ్రముగా

నుద్ధరించువాఁడనగుచున్నాను. నాయందే మనో బుద్ధులనుంపుము, ఈదేహమునశించినపిదప నాయందే యుండఁగలవు; సంశయములేదు. ఓధనంజయ! అటుపిమ్మటనాయందుఁ జిత్తమునిశ్చలమగునటుల నిలుపశక్తుఁడవుగావేని యభ్యాసయోగముచే నన్నుఁ బొందఁగోరుము; అభ్యాసయోగమునందు నశక్తుఁడవయితివేని నావిషయమయినకర్మ ప్రధానముగాఁగలవాఁడవుకమ్ము. నాకొఱకు సత్కర్మములు సేయుచున్నవాఁడనౌదువేని, మోక్షమును బొందఁగలవు. అంతట, నిట్టి కార్యము సేయుటకు నశక్తుండవగుదువేని నా యోగము నాశ్రయించినవాఁడవై సమస్త కర్మఫలత్యాగము సేయుము. అభ్యాసయోగమున కంటెను జ్ఞానయోగము శ్రేష్ఠమయినదిగదా? జ్ఞానమునకంటెను ధ్యానము శ్రేష్ఠమగుచున్నది: ధ్యానమునకంటెను కర్మఫలపరిత్యాగమును, సట్టి త్యాగమునకంటెను శమమును, శ్రేష్ఠమగుచున్నవి. సమస్త ప్రాణులకు ద్వేషి కానివాఁడును, నహంకార రహితుఁడును, మిత్రుఁడును, దయగలవాఁడును, మమకార రహితుఁడును, సుఖదుఃఖములయందు సముఁడును,

ఓర్పుగలవాఁడును, సదాసంతోషముఁ బొందువాఁడును, ధ్యానమునందున్నవాఁడును, నియమింపఁబడెన మనోవృత్తిగలవాఁడును, సంశయరహితుండును, నాయందుంచఁబడిన మనోబుద్ధులు గలవాఁడును, నాభక్తుండును నను నిట్టి గుణములుగల వాఁడు నాకునిష్టుఁడు; జనులకు భయము గలుగఁజేయనివాఁడును, జనులవలన భయపడని వాఁడును, అప్రీతియు అసహిష్ణుత్వమును భయమును ఉద్వేగమ్మును లేనివాఁడును, నను నిట్టి గుణములుగల వాఁడును నాకునిష్టుఁడు; అపేక్షారహితుండును, పవిత్రుండును, సమర్థుండును, పక్షపాత రహితుండును, దుఃఖము లేనివాఁడును, సర్వసంకల్పరహితుండును, నాకుభక్తుండును, నగు వాఁడు నాకునిష్టుండుఁ; శత్రుమిత్రులయందును స్నేహితుల యందును మానావమానములయందును సముఁడయినవాఁడును, శీతోష్ణసుఖ దుఃఖములయందు సమానుండును, సంగరహితుండును, నిందాస్తుతులయందు సమానుండును, వాఙ్నియమము గలవాఁడును, ఎంతమాత్రముచేనైనను దృప్తిఁబొందువాఁడును, నివాసరహితుండును, నిశ్చయబుద్ధి గలవాఁడును, నాయందలిభక్తిఁగలవాఁడును నగుఁ బురుషుఁడు నాకు

నిష్టుఁడు. నేనేపరమగతిగాఁ గలవారలయి, యీ మోక్షప్రదమైన యమృతమును విశ్వసించినవారలై, నాచేఁ జెప్పఁబడిన క్రమమునతిక్రమింపక సేవింపు నట్టి యీభక్తులు నాకు మిగుల నిష్టులు.

ఇది శ్రీభగవద్గీతా వచనంబను యోగశాస్త్రంబున శ్రీకృష్ణార్జున సంవాదంబునందు భక్తి యోగము పండ్రెండవయధ్యాయము.



## పదమూఁడవయధ్యాయము.



## క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగము.



### అర్జునునివాక్యము.

ఓకేశవ! ప్రకృతియుఁ, బురుషుండును, క్షేత్రమును, క్షేత్రజ్ఞుండును, జ్ఞానమును, జ్ఞేయమునను నీవలన స్పష్టముగాఁ దెలిసికొనఁ గోరుచున్నాఁడను.

### శ్రీభగవద్వాక్యము.

ఓయర్జున! ఈదేహము, క్షేత్రమని చెప్పఁబడుచున్నది; ఈశరీరమును దెలిసిన క్షేత్రజ్ఞవేత్త లాతెలిసినవానిని క్షేత్రజ్ఞుఁడని చెప్పుదురు. ఓయర్జున! సమస్తక్షేత్రములయందు క్షేత్రవేత్తగా నన్నుఁదెలియుము; క్షేత్రక్షేత్రజ్ఞుల జ్ఞానమే జ్ఞానమని నామతము; ఓయర్జున! ఆక్షేత్రమేదియో, ఎట్టిదో, ఏవికారముగలదో, ఏకారణము వలననే

కార్యముఁబుట్టునో, ఆక్షేత్రజ్ఞుఁ డెవఁడో, ఎట్టి ప్రభావముగలవాఁడో, ఆస్వరూపమును సంక్షేపముగా నావచనము వలన వినుము; తత్స్వరూపము వశిష్ఠాది ఋషులచే బహుప్రకారములుగాఁ జెప్పఁబడెను, నానావిధములయిన వేదములచేఁ బ్రత్యేకముగాఁ జెప్పఁబడెను, యుక్తియుక్తములయినవియు నిస్సంశయముగా నిర్ణయింపఁబడినవియు నగు బ్రహ్మసూత్ర వాక్యములచేఁ జెప్పఁబడెను; పృథివ్యాదిభూతములును, అహంకారమును, బుద్ధియును, మాయయును, జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు పదియును, మనస్సును, కలిసి పదునొకొండగు నింద్రియములు నయిదయిన శబ్దాదివిషయములనునివి చతుర్వింశతితత్త్వంబులు. కోరికయును, ద్వేషమును, సుఖమును, దుఃఖమును, దేహేంద్రియాది సంహతియును,మనోవృత్తియును, ధైర్యమును, తత్తద్వికారముల తోడను గూడినది క్షేత్రమని సంగ్రహముగాఁ జెప్పఁబడెను; తమ్ముతాము స్తోత్రముసేసికొనకుండుటయు, తనధర్మమును బ్రకాశముసేసి కొనకుండుటయు, హింసారాహిత్యంబును, క్షమయు, కౌటిల్యరాహిత్యంబును, గురుసేవయు, బాహ్యాభ్యంతరశుచిత్వం

బును, జలనము లేకుండుటయు, మనో నిగ్రహం
బును, విషయములయందు వైరాగ్యంబును, అహం
కారము లేకుండుటయు, జన్మమరణ జరారోగ
దుఃఖములయందలి దోషముల నాలోచించుటయుఁ,
బుత్ర మిత్ర దార గృహాదులయందు నాసక్తిలేకుండు
టయు, సనన్యాస్త్మ భావనాలక్షణమైన యాసక్తి
విశేషములేకుండుటయు, ఇష్టానిష్టముల ప్రాప్తి
యందు సర్వదా సమానమనస్సు కలిగియుండు
టయు, నాయందే యనన్యదేవతర గతిలేదనెడి
యోగముచే నవ్యభిచారమునుఁ బొందనట్టి భక్తికలిగి
యుండుటయును, విజనస్థలవాసియగుటయు, జన
సమూహమునందనురాగము లేకయుండుటయు, నా
త్మజ్ఞానమందు నిత్యభావమును, మోక్షజ్ఞానమందు
ప్రయోజనదృష్టియు ననెడి యీ చెప్పఁబడినవి జ్ఞాన
మని చెప్పఁబడెను. దీనికంటె నన్యమయినవి యజ్ఞాన
మని చెప్పఁబడెను. తెలియఁదగినవి యేదో
దానిని జెప్పెదను. దేనిని దెలిసి మోక్షముఁ జెందఁగ
లఁడో యది ఆదిలేనట్టిదియు నుత్కృష్టమయినదియు
నగు నా బ్రహ్మము సత్తును నసత్తునుగాదని చెప్పఁబడు
చున్నది. ఆబ్రహ్మమంతటను హస్త పాదములు
గలిగినదియు, నంతటను శిరోముఖములు గలిగి

నదియు, నంతటను శ్రోత్రములు గలిగినదియునై సమస్తమును వ్యాపించి లోకమునందున్నది. ఆ బ్రహ్మము సకలేంద్రియ వ్యాపారములచేఁ బ్రకాశించుచున్న దానివలెనుండినను సకలేంద్రియరహితమయినదియు, దేనిని నంటనిదయినను సమస్తమును ధరించినట్టిదియు, గుణములేనిదైనను గుణములను భవించునట్టిదియుఁ, బ్రాణుల లోను వెలుపలను రూపములేకుండుటవలన నాబ్రహ్మము తెలియనశక్యమైనదిగాను, పొందనశక్యమయినదిగాను, సమీపమునందున్నది గాను, భూతములయందు నవిభక్తమైనదైనను విభక్తమైన దానివలనేయున్న యీబ్రహ్మము స్థితికాలమునందు భూతములను భరించు నట్టిదియును, ప్రళయకాలమునందు భూతములను గ్రసించునట్టిదియును, ఉత్పత్తిచేయునపుడు భూతములను బుట్టించునట్టిదియునై యున్నదని తెలియఁదగినది; ఆ బ్రహ్మము సూర్యాది తేజస్సులకంటెను బ్రకాశమయినదియు, నజ్ఞానముకంటెను వ్యతిరిక్త మయినదియుఁ, బ్రకాశ మయినదియుఁ, తెలియఁదగినదియు, జ్ఞానగోచర మయినదియు, సమస్తప్రాణుల హృదయమునందున్న దియునని చెప్పఁబడుచున్నది. ఇట్లు క్షేత్రమును, జ్ఞానమును,

దెలియఁదగినది సంగ్రహముగాఁ జెప్పఁబడెను. నాభక్తుఁడు ఈయర్థమును దెలిసికొని నాస్వరూపమే యగుటకొఱకు సర్హుఁడవుచున్నాఁడు; క్షేత్రమును, క్షేత్రజ్ఞుని, ఈ రెంటిని నిత్యములుగాను దెలియుము. బుద్ధ్యాది వికారరూపములును గుణములును బ్రకృతివలనఁబుట్టిన వానినిగానే లెలెయుము. మాయ, శరీరసుఖదుఃఖాదులను బుట్టించుటయందు హేతువని చెప్పఁబడుచున్నది. క్షేత్రజ్ఞుఁడు, సుఖదుఃఖములనను భవించుటయందు హేతువని చెప్పఁబడుచున్నాఁడు. పురుషుఁడు ప్రకృతియందున్నవాఁడై ప్రకృతివలనఁ బుట్టినగుణములననుభవించుచున్నాఁడు. ఈపురుషునికి సుఖదుఃఖాది గుణాసక్తి, పుణ్యాపుణ్య రూపయోనులయందుజన్మించుటకుఁ గారణమగుచున్నది. కార్యకరణ వ్యాపారములయందు సుపద్రష్టయైన వాఁడు ననుమోదించునట్టివాఁడును భరించునట్టివాడు ననుభవించునట్టివాఁడును మహేశ్వరుఁడైనట్టివాఁడును బరమాత్మయని చెప్పఁబడినట్టి వాఁడునగు క్షేత్రజ్ఞుఁడీ దేహమునందునుత్కృష్టుఁడైనవాఁడు; ఎవఁడు, ఈ ప్రకారముగా క్షేత్రజ్ఞుని వికారములతోఁ గూడఁ బ్రకృతిని ఎఱుంగుచున్నాఁడోవాఁడు సర్వప్రకార

ముల చేతనున్నవాఁడైననుమరల పుట్టఁడు.కొందఱు ధ్యానముచే బుద్ధియందు, మనస్సువలన బర మాత్మను జూచుచున్నారు. మఱికొందఱు జ్ఞాన యోగముచేతను, మఱికొందఱు కర్మయోగము చేతను, బరమాత్మను జూచుచున్నారు. మఱి కొందఱు పరమాత్మను ఎఱుఁగనివారలయి యిత రులయిన యాచార్యుల వలనవిని ఉపాసించు చున్నారు. వేదాంతశ్రవణ పరులైనవారలు మృ త్యువునతిక్రమించుచున్నారు. ఓయర్జున! స్థావర జంగమాత్మకమయిన స్వల్పవస్తువెంతపుట్టుచున్నదో అదియెంతయుఁ బ్రకృతిపురుష సంసర్గము వలనఁ గలిగినదని తెలియుము. ఎవఁడు సమస్త ప్రాణుల యందు సమముగానున్నట్టి పరమేశ్వరుని ఆప్రా ణులు నశించినను నశింపని వానినిగాఁ జూచు చున్నాఁడో వాఁడు నేత్రములయందుఁ దిమిరాది దోషములుకలిగి యేకచంద్రుని ననేకచంద్రులనుగాఁ జూచువానికంటె నట్టిదోషములేనివాఁడు ఏకచం ద్రుని నేకచంద్రునిగాఁ జూచునట్లు ఒక్కఁడగుపర మాత్మను నజ్ఞాన దోషముచే వేఱువేఱుగాఁ జూడక జ్ఞానముచేనొక్కనిగానే చూచుచున్నాఁడు. ఏకారణమువలన . సమస్త ప్రాణులయందుసమ

ముగా నున్నట్టి యీశ్వరుని జూచువాఁడు తనచేఁబరమాత్మను హతము చేయఁడు. అందు వలనఁబరమగతిని బొందుచున్నాఁడు. ఎవ్వఁడు కర్మములను మాయచేతనే సర్వప్రకారములుగాఁ జేయఁబడుచున్న వానినిగాను ఎపుడు చూచు చున్నాఁడో, అపుడు వాఁడు తన్ను కర్మ చేయనివా నినిగాను ఉపాధిరహితునిగాను జూచుచున్నాఁడు. ఎప్పుడు భూత భిన్నభావము నొకచానియందున్న వానినిగాఁ యపుడు జూచుచున్నాఁడోఁ, అట్లు చూచుటవలన విస్తారమగు బ్రహ్మమువానిచేఁ బొందఁబడుచున్నది. అపుడువాఁడే బ్రహ్మమగు చున్నాఁడు. ఓయర్జున! మొదలులేకపోవుటవల నను, గుణములేక పోవుటవలనను, నాశరహితుం డయిన యీపరమాత్మ శరీరమందున్నప్పటికిని కర్మ ము సేయఁడు, కర్మఫలములనంటఁడు. ఏప్రకార మాకాశము సర్వ వ్యాపియైనను సూక్ష్మమగుట వలన నొకదానితోడను సంబంధింపదో, అట్లు క్షేత్ర జ్ఞుఁడు దేహమందంతటనున్నవాఁడైనను నంటఁడు. ఓయర్జున! సూర్యుఁడొక్కఁడెట్లీ సమస్తజగత్తును బ్రకాశింపఁ జేయుచున్నాఁడో, అట్లే క్షేత్రజ్ఞుఁడు సమస్తమగుశరీరమును బ్రకాశింపఁజేయుచున్నాఁడు.

క్షేత్రక్షేత్రజ్ఞుల భేదమును, భూతములకుఁబ్రకృతి యొక్క మో* క్షమును, జ్ఞాన+దృష్టిచే నెఱుంగువారు పరబ్రహ్మమును బొందుచున్నారు.

ఇది శ్రీభగవద్గీతా వచనంబను యోగశాస్త్రంబున శ్రీకృష్ణార్జున సంవాదంబునందు క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగము పదమూఁడవయధ్యాయము.

---

* విడుచుటయనుట

+ జ్ఞానదృష్టిచే = శాస్త్రాచార్య ప్రసాదోపదేశము వలనఁ బుట్టినయాత్మ, సాక్షాత్కార జ్ఞానముచే.



# పదునాలుగవయధ్యాయము.

## గుణత్రయవిభాగయోగము.

### శ్రీభగవద్వాక్యము-

జ్ఞానములలో నుత్తమమైనదియు, నుత్కృష్టమైనదియునగు జ్ఞానమును మరలఁ జెప్పెదను. అట్టిజ్ఞానమునెల్ల ఋషులెఱింగి యింతకంటెను బరమగతిని బొందిరి; ఈజ్ఞానసాధనమును బొందినేని నాస్వరూపమును బొందినవారలై సృష్టికాలమందును బుట్టరు; ప్రళయకాలమునందును వ్యధను బొందరు. ఓయర్జున! అధికమగు నాయపరప్రకృతి, భూతసృష్టికిఁ గారణము; ఆప్రకృతియందు నేను గర్భమునుంచుచున్నాను; దానివలన సమస్తప్రాణులు యుత్పత్తి యగుచున్నవి. ఓయర్జున! సమస్తయోనులయందు నేదేహ సంస్థానలక్షణములు పుట్టుచున్నవో, ఆదేహముల కధికమైన ప్రకృతి, తల్లి. నేను, గర్భాధానకర్తనైన తండ్రిని. ఓసవ్యసాచి! భగవన్మాయవలనఁ బుట్టిన

సత్త్వరజస్తమో గుణములు ,నాశరహితుఁడైన
క్షేత్రజ్ఞుని దేహమునందు నరిగట్టునానివలెనున్నవి.
ఆసత్త్వరజస్తమో గుణములలో స్వచ్ఛమగుట
వలన స్ఫటికమణివలెఁ బ్రకాశింపఁ జేయునదియు
సుపద్రవరహితమైనదియునగు సత్త్వగుణము సుఖ
సంగమముచేత నంతఃకరణ ధర్మముచే దేహిని, అరి
గట్టుచున్నది. ఓయర్జున! రానివస్తువును గోరు
టయును బ్రాప్తమైనవిషయములయందుఁ బ్రీతిగలిగి
యుండుటయునను నీరెండింటివలనఁ బుట్టిన రజో
గుణ మనురంజనస్వరూపమైన దానినిగాఁ దెలి
యుము. ఆరజోగుణము దేహిని గర్మాసక్తిచేఁగట్టు
చున్నది. ఓయర్జున! సమస్తప్రాణులకును మో
హకరమైన తమోగుణము, అజ్ఞానమువలనఁ బుట్టి
నదిగాఁ దెలియుము; ఆతమోగుణము, ప్రమాదా
లస్యనిద్రలచేతఁ గట్టుచున్నది. ఓయర్జున!
సత్త్వగుణము, సుఖమునందుఁ గూర్చుచున్నది;
రజోగుణము, కర్మమునందుఁ గూర్చుచున్నది;
తమోగుణము,జ్ఞానముగప్పి ప్రమాదమునందుమరచి
యుండుటయందుఁ గూర్చుచున్నది; ఆశ్చర్యము!
ఓయర్జున! రజస్సును దమస్సును దిరస్కరించి

సత్త్వగుణము గలుగుచున్నది; రజస్సును సత్త్వమును దిరస్కరించి తమోగుణము గలుగుచున్నది; తమస్సును సత్త్వమును దిరస్కరించి రజోగుణముగలుగుచున్నది. ఓయర్జున! భోగస్థానమైన యీశరీరమునందు శ్రోత్రాదిసకలద్వారముల యందు నెప్పుడును బ్రకాశమగు జ్ఞానస్వరూపమైన తెలివిపుట్టుచున్నదో, అప్పుడుసత్త్వగుణము వృద్ధిఁబొందినదని తెలియవలయును. ఓయర్జున! రజోగుణము వృద్ధిఁబొందుచుండఁగాఁ బరద్రవ్యాదికాంక్షయు, సామాన్యచేష్టయుఁ, గర్మములయారంభమును, శమములేకపోవుటయు, ఇచ్ఛయు ననునివి చిహ్నములు పుట్టుచున్నవి. ఓకురునందన! వివేకములేకపోవుటయు, ఊరకయుండుటయు, సావధానములేకపోవుటయు, మోహము, ననునీలక్షణములు తమోగుణము వృద్ధిఁబొందుచుండఁగాఁ బుట్టుచున్నవి. శరీరి సత్త్వగుణమువృద్ధిఁబొందుచుండఁగా మరణమును బొందిన స్వచ్ఛమైన బ్రహ్మవేత్తలలోకిమును బొందుచున్నాఁడు; రజోగుణమువృద్ధిఁ బొందుచుండఁగా మరణమునుబొందినవాఁడు, మనుష్యులయందుఁ బుట్టుచున్నాఁడు; తమోగుణము వృద్ధిఁ బొందుచుండఁగా మరణమును

ందినవాఁడు శ్వసూకరాది యోనులయందుఁ బుట్టుచున్నాఁడు; పెద్దలు సత్త్వగుణము వలనఁ బుట్టిన కర్మమునకు సాత్త్వికమైననిర్మలమగు ఫలమును జెప్పుదురు; రజోగుణ కర్మమునకు ఫలమును దుఃఖకరమయినదిగాఁ జెప్పుదురు; తామసకర్మమునకు ఫలము నజ్ఞానముగాఁ జెప్పుదురు. సత్త్వగుణమువలన జ్ఞానముపుట్టుచున్నది; రజోగుణమువలన లోభమేపుట్టుచున్నది; తమోగుణమువలనం బ్రమాదమోహములు పుట్టుచున్నవి, అజ్ఞానమును బుట్టుచున్నది. సాత్త్వికులు దేవాదిలోకములఁ బొందుచున్నారు: రజోగుణ వృత్తిగలవారలు మనుష్యలోకమునందున్నారు: నికృష్టగుణవృత్తియందున్న తమోగుణము గలవారలు పశ్వాదియోనులయందు జన్మమును బొందుచున్నారు. తెలిసినవాఁడు విషయములకంటె నన్యమును గర్తగాఁ జూచునపుడును, గుణములకంటెను వ్యతిరిక్తుఁడై గుణవ్యాపారసాక్షిభూతునిఁ దెలియు నపుడును, నాస్వరూపమును బొందుచున్నాఁడు. దేహధారి దేహమువలనఁ బుట్టిన యీమూఁడుగుణముల నతిక్రమించి జన్మమృత్యుజరా రోగములచే విడువఁబడినవాఁడై మోక్షమును బొందుచున్నాఁడు.

## అర్జునునివాక్యము.

ఓస్వామీ! ఏచిహ్నములచే నీమూఁడు గుణముల నతిక్రమించిన వాఁడగుచున్నాఁడు. వాఁడెట్టి యాచారము గలవాఁడు ఎటులనీమూఁడు గుణముల నతిక్రమించుచున్నాఁడు.

## శ్రీభగవద్వాక్యము.

ఓయర్జున! త్రిగుణాతీతుఁడైనవాఁడు సంప్రాప్తములైన సత్త్వగుణకార్యములను, తమోగుణకార్యములను, ద్వేషింపఁడు; పోయినసత్త్వాది కార్యములను గోరఁడు. పక్షపాతములేనివాని వలె నున్నట్టివాఁడును, గుణములచేఁజలింపఁ బడనివాఁడును, గుణములు వర్తించుచున్నవని యెంచి చలింపనివాఁడును, సుఖదుఃఖములయందు సముఁడును, నాత్మావలోకనపరుఁడును, బంగారు మంటిగడ్డ రాయి వీనిని సమముగాఁ జూచువాఁడును, ప్రియాప్రియములయందు సముఁడును, ధైర్యముగలవాఁడును, నిందాస్తుతులయందును మానావమానముల యందును దుల్యుఁడయిన వాఁడును, శత్రుమిత్ర పక్షములయందు సముఁడును సర్వారంభ పరిత్యా

గుఁడగువాఁడు గుణాతీతుండని చెప్పంబడుచున్నాఁడు; నన్ను నిశ్చలమయిన భక్తియోగములచే సేవించుచున్నవాఁడీ గుణముల నతిక్రమించి బ్రహ్మభావమునకు సమర్థుఁడగుచున్నాఁడు. పరమాత్మకు నాశ్రయము నేను: నాశములేని మోక్షమున కాశ్రయము నేను; నిత్యమైన ధర్మమున కాశ్రయము నేను. ముఖ్యమైన సుఖమున కాశ్రయము నేనగుచున్నాను.

ఇది శ్రీభగవద్గీతా వచనంబను యోగశాస్త్రంబున శ్రీకృష్ణార్జున సంవాదంబునందు గుణత్రయవిభాగయోగము పదునాలవయధ్యాయము.



# పదునైదవయధ్యాయము



## పురుషోత్తమప్రాప్తియోగము.



### శ్రీభగవద్వాక్యము.

ఓసవ్యసాచి! బ్రహ్మను మూలంబుగాను, మహదహంకారములు శాఖలుగాఁగల మాయామయంబైన ×సంసారంబను నశ్వత్థ* వృక్షమును నాశరహితంబుగాఁ జెప్పుదురు. ఈవృక్షమునకు వేదములాకులవంటివి; దీనినెఱింగిన పురుషుఁడు వేదార్థమును దెలిసినవాఁడగు. అట్టిసంసారవృక్షంబునకు శాఖలచందంబుననుండు నవ్యక్తాదులు, గుణములచే స్థూలంబులుగాఁ జేయంబడినవై, శబ్దాది విషయములు చిగుళ్లుగాఁగలవిన్నై, దిగువను మీఁద

---

* శ్వః + తిష్ఠతీతి = శ్వత్థః: సఃనభవతీతి = అశ్వత్థః = అశాశ్వతమైనశించునది. = దేహము.

× సంసారము = దేహము.

ను విస్తృతంబులై యున్న యావృక్షము యొక్క రాగద్వేషాదులగు మొదళ్లు మానవలోకంబునందు ధర్మాధర్మ లక్షణంబగుఁ గర్మఫలను, ముందుఁగాఁ గలవియై క్రిందను మీఁదను బ్రవేశించియున్నవి; ఇట్టివృక్షమునందుండు ప్రాణులకు నీసంసారవృక్ష స్వరూపము తెలియంబడదు. అటులనేతుదయును. మొదలును, స్థితియును, దెలియఁబడవు, దృఢమైన వేళ్లుగల యీ యశ్వత్థమనెడి సంసారవృక్షంబును దృఢముగు విరక్తియనెడి యాయుధముచే ఛేదించిన వెనుక, పొందినపిదప మరలఁ దిరుగఁ జేయనట్టి పదమును, మఱియుఁ బురాతనమగుసంసారవృక్షప్రవృత్తి ప్రవర్తనకు మూలకారణమైన యా పరమాత్మను శరణుఁబొందుచున్నానని యామోక్షస్థానము వెదుకఁదగినది. మాన మోహములు లేనివాఁడును, జయింపఁబడిన సంగ దోషముగల వాఁడును, జ్ఞానవిద్యాసక్తుండును, ఇచ్ఛలులేని వాఁడును, శీతోష్ణాది సుఖదుఃఖములనెడి సౌజ్ఞలుగల ద్వంద్వములచే విడువంబడినవాఁడును, నగు జ్ఞాని నాశరహితమగుస్థానమును బొందుచున్నాఁడు. అట్టిపరమపదమును సూర్యచంద్రాగ్నులు ప్రకాశింపఁజేయంజాలరు. పొందినవెనుకమరల రా

నట్టిల౯ జేయని పరమపదము నాస్థానమేను: జీవుఁడు పరమాత్మయును నారాయణుఁడనునైననాయొక్క పురాతనమైనయంశమే. అదెట్లనిన సంసారమునం దుఁబా్రచీనమునై కర్తృత్వభోక్తృత్వాదికమును బొందిప్రసిద్ధమైన జీవుఁడు, జలగతమైన సూర్యాదిప్రతిబింబము జలాపాయమునందు సూర్యస్వరూపమైనట్లుగా ఘటాద్యావరణ నాశమునందు ఘటాకాశము మహదాకాశమైనట్లును అవిద్యాకృతమైన బుద్ధ్యాద్యుపాధి నాశనమునందు నేనేయగుచున్నాఁడు. ఇట్టిజీవుఁడు, జీవస్వరూపంబైనమాయయందుండు మనస్సుతోఁగూడిన యింద్రియముల నాకర్షించుచున్నాఁడు. ఈప్రకారము జీవుఁడు శరీరము పొందునపుడును, విడుచునపుడును, వాయువు పుష్పాదిస్థానములనుండి గంధమునుగ్రహించుకొని పోవుచందంబుననే యీయింద్రియములను గ్రహించుకొని పోవుచున్నాఁడు. ఈజీవుఁడుశ్రోత్రచక్షుస్స్పర్శరసన ఘ్రాణేంద్రియములను,మనస్సును, అధిష్ఠించి శబ్దాదుల ననుభవించుచు దేహము విడుచుచు, దేహమునందు నివసించుచు, శబ్దాది విషయముల ననుభవించుచు, సుఖదుఃఖమోహాది గుణములతోఁగూడి ప్రత్యక్షముగానున్న తన్నుఁజూ

డంచు. జ్ఞానదృష్టిగలవారలు ఈజీవునిఁజూచుచున్నారు, యోగులు యత్నము సేయుచున్నవారలై యీయాత్మను దనయందున్నవానిఁగాఁ జూచుచున్నారు, ఆత్మజ్ఞానములేనట్టి యవివేకులు యత్నముసేయు వారలయ్యును నాయీ యాత్మను జూడరు. సమస్తలోకమును బ్రకాశింపఁ జేయుచున్న సూర్యగతంబయిన తేజస్సును చంద్రాగ్నులయందలి తేజస్సును నాసంబంధమైన వానినిగాఁ దెలియుము. నేనుభూమిని బ్రవేశించి బలముచేఁ బ్రాణులను ధరించుచున్నాను. రసస్వరూపుండగు సోముఁడనయి సమస్తౌషధులను బోషించుచున్నాను. నేను జఠరాగ్నినయి దేహధారులశరీరము నాశ్రయించి ప్రాణాపాన వాయువులతోఁ గూడి భక్ష్యభోజ్యచోష్య లేహ్యములగుఁ జతుర్విధములగు నన్నమును బచనముఁ జేయు చున్నాను. సమస్తప్రాణిజాతముయొక్క హృదయములయందునేను బ్రవేశించియున్నాను. కావునఁ దెలివియును, జ్ఞానమును, స్మృతిజ్ఞానాపగమనమును, నావలననే గలుగుచున్నవి. సమస్త వేదములచేఁ దెలియందగినవాఁడును, వేదాంతమును జేసినవాఁడును, వేదముదెలిసిన వాఁడును, నేనే. లోకమునందు

క్షరుఁడనియు, అక్షరుఁడనియు, రెండు జాతుల పురుషులుగలరు. అందుక్షరపురుషుఁడు సమస్త భూతములనియు, నక్షరపురుషుఁడు జీవుఁడనియుఁ జెప్పఁబడుచున్నారు. ఈయిరువురకంటెను విలక్షణుండగుఁ బరమపురుషుఁడు పరమాత్మయని చెప్పంబడు. ముల్లోకములను బ్రవేశించి భరించుచుండెడి యాపరమాత్మ నాశరహితుఁడగు శ్రీమన్నారాయణుండని చెప్పఁబడు. ఏనుక్షరపురుషునతిక్రమించిన వాఁడను, నక్షరునికంటె నుత్తముఁడనగుచున్నాను. కావున లోకమునందును వేదమునందును బ్రసిద్ధుఁడగుఁ బురుషోత్తముఁడ నగుచున్నాను. ఓయర్జున! మోహవర్జితుండై యిట్లు పురుషోత్తముఁడనై ననన్నుఁ దెలియువాఁడు సర్వజ్ఞుండై సమస్తవిధముల చే నన్నుఁబొందుచున్నాఁడు. ఓయర్జున! మిగుల రహస్యంబగు నీశాస్త్రంబును నాచేనీకుం జెప్పంబడెను. ఈశాస్త్రమును దెలియుమానవుఁడు బుద్ధిగలవాఁడును, గృతకృత్యుండును నగు.

ఇది శ్రీభగవద్గీతావచనంబను యోగశాస్త్రంబున శ్రీకృష్ణార్జున సంవాదంబునందుఁ బురుషోత్తమప్రాప్తియోగము పదునైదవయధ్యాయము.

పదనాఱవయధ్యాయము.



## దైవాసురసంపద్విభాగయోగము.



### శ్రీభగవద్వాక్యము.

ఓయర్జున! భయములేకుండుటయు, సత్త్వసంశుద్ధియు, జ్ఞానయోగమునందుండుటయు, దానముచ్చుటయు, బాహ్యేంద్రియ నిగ్రహంబును, యజ్ఞమును, వేదాధ్యయనంబును, తపస్సును, ఋజుత్వంబును, అహింసయు, సత్యంబును, క్రోధంబులేకుండుటయును, త్యాగంబును, జిత్తోపశమనంబును, పిశునత్వ రాహిత్యంబును, సర్వప్రాణులయందుఁ గృపయును, విషయసన్నిధి నింద్రియ వికారంబులేకుండుటయు, మృదుత్వంబును, సిగ్గును, చాపల్యంబు లేకుండుటయుఁ, బ్రతిభతోఁగూడి యుండుటయు, ఓర్పును, ధైర్యంబును, శౌచంబును, బరులకుద్రోహముసేయకుండుటయు, గర్వము లేకుండుటయు,

ననునీయభయ్యాదులు, దేవతాసంబంధమగు, సంపద
నుగూర్చిపుట్టినవానికిఁ గలుగుచున్నవి. ఓయర్జున!
అసుర సంబంధమయిన సంపదనుగూర్చి పుట్టిన
వానికి, దంభము, గర్వము, అభిమానము, క్రో
ధము, పరుషత్వము, అజ్ఞానము, కలుగుచున్నవి.
దేవతాసంబంధమగు సంపద సంసారవిమోచన
కొఱకు సమ్మతంబైయుండు; అసురసంబంధమగు
సంపద సంసారబంధము కొఱకు సమ్మతంబైయుం
డు. ఓయర్జున! నీవు దేవతాసంబంధమయినసంప
దను గూర్చి పుట్టినవాఁడవైతివి; కావున దుఃఖింప
కుము. ఓకౌంతేయ! ఈలోకమునందు దేవతా
సంబంధమనియు, అసురసంబంధమనియుఁ, బ్రాణి
సృష్టులు రెండువిధములుగా విభజింపఁ బడియు
న్నవి. ఆరెండింటియందును దేవతాసంబంధమైన
సృష్టివిస్తరించి చెప్పఁబడెను. అసురసంబంధమైన
భూతసృష్టిని నావాక్యమువలననే వినుము. అసుర
స్వభావము గల జనులు ధర్మప్రవృత్తిని ధర్మ
నివృత్తిని దెలియరు: వారియందు శౌచమును,
ఆచారమును, సత్యమును, లేవు. అట్టియసురజనులు
జగత్తును నసత్యంబుగాను, ప్రతిష్ఠారహితంబైనది
గాను, నియామకుఁడు లేనిదిగాను, జెప్పుదురు.

ఇదియునుంగాక స్త్రీపురుషుల పరస్పర సంబంధమువలనఁ బుట్టినదిగాని మఱియేమి యున్నది; జగత్తంతయుఁ గామహేతువుగాఁ గలిగినదని చెప్పుదురు; ఇట్టిజ్ఞానమవలంబించినవారలు నష్టాత్ములును, స్వల్పబుద్ధి గలవారలును, హింసాక్రూరకర్మములుగలవారలును, శత్రువులునై లోకనాశము కొఱకు పుట్టుచున్నారు. నిందింపనశక్యమయిన కోరికల నాశ్రయించి మోహమువలన నన్యాయపు పరిగ్రహంబుల గ్రహించి అశాస్త్ర నియమముగలవారలై దంభమాన మదములతోఁ గూడి ప్రవర్తించుచున్నారు. మరణమే తుదగాఁ గల యపరిమిత మగుఁ జింతను నాశ్రయించినవారలును, గోరికల ననుసరించుటయే యుత్కృష్టముగాఁ గలవారలును, ఇంతయేయని నిశ్చయించినవారలును, నూరువిధములగు నాశాపాశములచేఁ గట్టఁబడినవారలునగుచు, కామక్రోధ పరాయణులై కామభోగముకొఱకు, అన్యాయముచేఁ బదార్థ సముదాయములను గోరుచున్నారు. ఇపుడునాచే నీధనముఁబొందఁబడెను, ఈసంకల్పముఁబొందఁగలను ఈధనమునాకుఁగలదు, ఈధనమునాకు మరలకాఁ

గలదు, ఈశత్రువునాచేఁ జంపఁబడెను, ఇతరశత్రువులను జంపఁగలను, నేను భోగవంతుఁడను నేను సంపన్నుఁడను, నేనుబలవంతుఁడను, నేనుసుఖవంతుఁడను, నేనుధనముగలవాఁడను, సత్కులముగలవాఁడనైతిని, నాతోసమానుఁ డన్యుఁడెవఁడు గలఁడు, యజ్ఞముసేసెదను, ఇయ్యఁగలను, సంతోషింపఁగలను, ఇట్లు అవివేకముచే మోహాంసఁబడి, నానావిధచిత్తవైకల్యము గలవార లగుచు, కామానుభవములయం దాసక్తులయి, యశుచియగు నరకమునందుఁబడుచున్నారు. తమ్ముఁదామే స్తోత్రముసేసికొనుచు, పెద్దలనిరాకరించి ధనమానమదములతోఁ గూడినవారలయినట్టి యవివేకులు నామమాత్ర యజ్ఞములతోడను డంభముచే శాస్త్రోక్తవ్యతిరిక్తముగా యజ్ఞముఁజేయుచున్నారు. అహంకారబలదర్ప కామక్రోధములనాశ్రయించి స్వేతరదేహములయందలి నన్ను ద్వేషించుచు, పరశ్రేయస్సును సహింపక, వర్తించుచున్నారు. ద్వేషులును, క్రూరులును, శుభరహితులును, నయిన నరాధములను, నేను, నిరంతరము సంసారములయందును, నసుర సంబంధములగు యోనులయందుఁనుంచుచున్నాను. ఓకురునందన! మూఢులు

ప్రతిజన్మములయందును, అసురయోనిం బొందిన వారలై నన్నుఁ బొందకయే, యధమగతిఁ బొందు చున్నారు. కోరికయనియుఁ, గ్రోధమనియు, లోభమనియు మూఁడువిధములుఁగలవు. ఇవినరకమునకు ద్వారములు; తనకునాశకరమైనవి; కావున, నీమూఁ డింటిని విడువవలయు; ఓయర్జున! ఈమూఁడు నరకద్వారములచే విడువంబడిన నరుఁడు తనకు శ్రేయస్సు నాచరింపుచున్నాఁడు, పిదపమోక్షగతిని బొందుచున్నాఁడు. శాస్త్రవిధిని విడిచి యథేచ్ఛముగా నర్తించువాఁడు సిద్ధిని, సుఖమును, మోక్షనిఁ బొందఁడు; అందువలననే కర్తవ్యాకర్తవ్య వ్యవస్థితి యందు శాస్త్రము జ్ఞానమునకుసాధనము. అందువలన శాస్త్రవిధిచేఁ జెప్పఁబడిన కర్మములను దెలిసికొని వానినిప్పుడు సేయుటకుఁ దగుదువు.

ఇది శ్రీభగవద్గీతా వచనంబను యోగశాస్త్రంబున శ్రీకృష్ణార్జున సంవాదంబునందు దైవాసుర సంపద్విభాగయోగము పదునాఱవయధ్యాయము.



## పదునేడవయధ్యాయము.



## శ్రద్ధాత్రయవిభాగయోగము.



### అర్జునునివాక్యము.

ఓ కేశవ ! శాస్త్రోచారమునువదలి, వృద్ధాచార సంప్రదాయాను సారముగా, ఆస్తిక్యబుద్ధితోఁ, బూజించువారినిష్ఠసాత్వికమా? రాజసమా? తామసమా?

### శ్రీభగవద్వాక్యము.

దేహధారులకు సంస్కారమువలనఁబుట్టిన యాశ్రద్ధసాత్విక విషయమనియు, రాజసవిషయమనియుఁ, దామసవిషయమనియు మూఁడువిధము లగుచున్నది, అట్టి శ్రద్ధనువినుము. ఓయర్జున ! సమస్త ప్రాణులకును విశిష్టసంస్కారయుక్తాంతఃకరణమునకు ననురూపమయిన విశ్వాసముగలుగు చున్నది. ఆకారణమువలన నీజీవుఁడు ఆస్తిక్య

బుద్ధిగలవాఁడగుచున్నాఁడు. ఏపురుషుఁడు ఏయాస్తికబుద్ధిగలిగియుండునో యట్టి శ్రద్ధయే ప్రధానముగాఁ గలవాఁడగు చున్నాఁడు. సత్త్వగుణనిష్ఠులు దేవతలను బూజించుచున్నారు. రజోగుణనిష్ఠులు యక్షరాక్షసులనుబూజించుచున్నారు, తమోగుణ నిష్ఠులగు మఱికొందఱు ప్రేతలను మాతృకాదులను బూజించుచున్నారు. దంభాహంకారానురాగములబలముతోఁగూడిన వారగునే జనులు శాస్త్రోక్తముగానిదియును, బీడాకరంబయినదియునగుఁ దపస్సును దపించుచు, అవివేకమువలన దేహమునందుండు నింద్రియ సమూహమును బీడించుచు తత్కర్మసాక్షి భూతమయి, దేహమునందున్న నన్నునుగృశింపఁజేయుచున్నారో వారలను ఆసురనిశ్చయము గలవారినిగాను దెలియుము. సమస్తప్రాణులకును మూఁడువిధములుగల భోజనమిష్టమగుచున్నది; అటులనే యజ్ఞతపోదానమును బ్రియములగుచున్నవి. వానిభేదములను వినుము. రసయుక్తమయినదియును, జమురుతోఁ గూడినదియును, జిరకాలస్థాయియైనదియును, బ్రియములయినదియును, ఆయుస్స బలారోగ్య సుఖప్రీతి వృద్ధికరంబయినదియు నగు

భోజనము సత్త్వగుణము గల వారలకు నిష్టంబై యుండు: దుఃఖశోకరోగప్రదములగు మిక్కిలి కారము నున్న, మిగులఁజేదును, మిగులఁబులుసును, మిగుల నుప్పును, మిగులవేడియును, మిగులఁగఠినములగు పదార్థాలు మొదలయినవి రజోగుణముగల వారికిఁ బ్రియములు. జాము వెళ్లి చల్లనైనదియు, రసవర్జి తంబైనదియు, దుర్గంధము గలిగినదియుఁ, బక్వ మయిన రాత్ర్యంతరితమయినదియు, భుక్తావశిష్ట మయినదియు, నపవిత్రమయినదియునగు నాహా రము తమోగుణముగల వారికినిష్టంబగు. ఫల కాంక్షారహితులచే యజ్ఞముచేయఁ దగినదేయను మనస్సమాధానము చేసికొని శాస్త్రోక్త విధిచే చేయంబడు యజ్ఞము సత్త్వగుణ ప్రధానమయినది. ఓయర్జున! యజ్ఞఫలము నుద్దేశించినను మహ త్త్వము ప్రకటనకొఱకయి చేయఁబడు యజ్ఞమును రజోగుణ ప్రధానమయినది యని తెలిసికొనుము. శాస్త్రవిహీనముకానిదియును, మంత్రరహితమయి నదియును, దక్షిణలేనిదియును, విశ్వాసము లేని దియు నగుయజ్ఞమును తమోగుణ ప్రధానమయి నదిగాఁజెప్పుదురు. దేవబ్రాహ్మణ గురుప్రాజ్ఞులఁ బూజించుటయును, శుచిత్వంబును, ఋజుత్వం

బును, బ్రహ్మచర్యంబును, నహింసయునను నివి శరీరప్రధానమయిన తపస్సని చెప్పంబడు. దుఃఖకరముఁ కానిదియు, యథార్థమయినదియుఁ బ్రియహితములయినదియు నగువచనంబును, వేదాభ్యాసంబునునగునివి వాఙ్మయమయిన తపస్సని చెప్పంబడుచున్నది. మనస్సునకు సమాధానమ్మయినమంచి ప్రవృత్తియును, వాఙ్నియమమును, మనోనిగ్రహంబును, మనశ్శుద్ధియుననునివి మనస్సంబంధమయిన తపస్సని చెప్పంబడు. ఫలకాంక్షా రహితులును యోగులునగు నరులచే నుత్కృష్ట శ్రద్ధచేఁదపింపఁబడిన మూఁడు విధములు గల తపస్సును సాత్త్విక గుణముచేనయినదిగాఁ జెప్పఁబడు. సత్కరింపుటకొఱకును, బహుమానము కొఱకును, డంభముచేతఁ జేయఁబడు తపస్సు ఈలోకమునందుఁ జంచలమయినదియు, నశించునదియు, నగు; అట్టితపస్సు రజోగుణసంబంధమయినదని చెప్పఁబడును. మూఢనిశ్చయముచేఁ బరునివినాశముకొఱకు దేహపీడచేఁ జేయఁబడుతపస్సు తామసమని చెప్పఁబడు. ఉత్తమక్షేత్రమునందును, పుణ్యకాలమునందును, యోగ్యుని యందును, ప్రత్యుపకారము లేనివానికొఱకు నియ్యంపఁగినదని ఇయ్యఁబడునట్టి దానము

సాత్త్వికమని స్మరింపఁబడెను. ఫలమునుద్దేశించిన దయినను మరల ప్రత్యుపకారముకొఱకై మనఃక్లేశమగునటుల నియ్యంబడుదానము రాజసమని చెప్పంబడు. నికృష్ట దేశకాలములయందు మూర్ఖ తస్కరాదులకొఱకు నియ్యఁబడు సత్కార రహితంబయి, యవమానయుక్తంబగు దానము తామసమని చెప్పఁబడెను. ఓంతత్సత్తని మూఁడు విధములు ౹౹ పరమాత్మనామోచ్చారణము చెప్పంబడెను. వానిచే బ్రాహ్మణులును, వేదములును, యజ్ఞములును బూర్వకాలమునందు నిర్మింపబడినవి. కావున శాస్త్రోక్తములయిన బ్రహ్మవాదుల యజ్ఞతపోదానములనెడు క్రియలెల్లప్పుడును ‚ ఓం ‚ అని యుచ్చరించి ఆరంభింపఁబడుచున్నవి, ముముక్షువులచే, ‚‚ తత్ ‚‚ అనెడి బ్రహ్మాభిధానమునుచ్చరించి, ఫలమును గోరక యజ్ఞతపోదాన క్రియలు చేయఁబడుచున్నవి; ఓయర్జున! కద్దనుటయందును, శ్రేష్ఠమనుటయందును, ‚‚ సత్ ‚‚ అనెడి పదంబును బ్రయోగింపఁ బడుచున్నది యజ్ఞతపోదానములయందలి నిష్ఠయు ‚‚ సత్ ‚‚ అనిపలుకఁ బడుచున్నది. ఓయర్జున! అవిశ్వాసముచేఁ జేయు హోమతపోదానాదులు ‚‚ అసత్ ‚ యనిపలుకఁ

బడు మన్నవి. కావున, నివి ఇహలోకమునందు ఫలింపవు; లోకాంతరమునందును ఫలింపవు.

ఇది శ్రీభగవద్గీతావచనంబను యోగశాస్త్రంబున శ్రీకృష్ణార్జున సంవాదంబునందు శ్రద్ధాత్రయవిభాగయోగము పదునేడవయధ్యాయము.

# పదునెనిమిదవ యధ్యాయము



## మోక్షసన్న్యాసయోగము.



### అర్జునునివాక్యము.

ఓహృషీకేశ! సన్న్యాసత్యాగంబుల తత్త్వం బును వేర్వేరం దెలియుట కిచ్ఛయించుచున్నాను.

### శ్రీభగవద్వాక్యము.

ఓయర్జున! పండితులు, కామ్యకర్మముల పరిత్యాగంబు సన్న్యాసంబుగాఁ దెలియుదురు. విద్వాంసులు, సర్వకర్మఫలత్యాగంబు త్యాగము గాఁ జెప్పుదురు; కొందఱుపండితులు కర్మ, దోషము గలదనియుఁ ద్యజించఁ దగినదనియుఁ జెప్పుదురు. మఱికొందఱు యజ్ఞదాన తపస్స్వరూపములయిన కర్మములవిడువఁదగనివని చెప్పుదురు. ఓయర్జున; ఇట్టిత్యాగమునుగురించి నానిర్ణయమును వినుము.

ఓయర్జున ! త్యాగము మూఁడువిధములుగాఁ జెప్పఁ బడియున్నది. యజ్ఞదానతపోరూపములగుఁ గర్మములు చేయఁదగినవి, విడువఁదగినవిగావు. యజ్ఞదానతపస్సులు పండితులకుఁ బవిత్రంబులయినవి. ఓయర్జున ! ఇట్టి కర్మములు, మమకార ఫలంబులను విడచి చేయఁ దగినవనియు, ఉత్తమమయినదియు నానిశ్చయంబు, మఱియును నాసమ్మతంబు. నిత్యకర్మపరిత్యాగము ఉపయుక్తముగాదు. అజ్ఞానమువలన నైనదియగు నట్టినిత్యకర్మపరిత్యాగము తామసమని చెప్పంబడెను. శరీరాయాసభీతివలనఁ గర్మము దుఃఖకరమయినదని పరిత్యజించినవాఁడు రాజోగుణ సంబంధమయిన త్యాగము సేసియు, త్యాగఫలమగు మోక్షఫలమును బొందఁడు. ఓయర్జున ! ఆసక్తిని ఫలమును విడచి నిత్యకర్మమును చేయందగినదని చేయఁబడు త్యాగము సాత్త్వికగుణమువలనఁ బుట్టినదని నాయభిమతము. సత్త్వగుణముచేఁ వ్యాపింపఁబడిన ఆత్మజ్ఞానము గలవాఁడును, ఛేదింపఁబడిన సందేహము గలవాఁడును, కర్మఫల త్యాగియునైన పురుషుఁడు అశుభకరంబగుఁ గామ్యకర్మమునుగుఱించి ద్వేషింపఁడు, శుభకరమయిన కర్మమందు నాసక్తుఁడుగాఁడు.

దేహాభిమానముగలవానికి సమస్తకర్మముల విడు
చుట, శక్యంబుగాదు; కావున కర్మఫలమునుత్య
జించువాఁడు త్యాగము గలవాఁడని చెప్పఁబడు
చున్నాఁడు. ఇష్టముకాని దనియు, ఇష్టమయిన
దనియు, ఇష్టానిష్ట మిశ్రమయినదనియు నను
మూఁడువిధములుగల కర్మముల ఫలమును త్యజిం
పనివారలకు జన్మాంతరముఁ బొందియును మఱల
జన్మముగలుగుచున్నది. కర్మఫలత్యాగులకో, ఒకప్పు
డును గలుగదు. ఓకురునందన! సమస్తకర్మములసిద్ధి
కొఱకయి సిద్ధాంతశాస్త్రములయందును, సాంఖ్య
శాస్త్రమందును జెప్పంబడిన అయిదు హేతువు
లను నావాక్యవలననే తెలిసికొనుము. దేహ
మును, అహంకారమును, నానాప్రకార మయినశ్రో
త్రాది కరణమును నానావిధమయినదియు, వేర్వే
ఱయినదియునగుఁ బ్రాణాపానాదివ్యాపారంబును,
ఈకారణములం దయిదవది సూర్యాద్యధి దైవం
బును, పురుషుఁడు మనోవాక్కాయములచే మంచి
దైనను అన్యాయమయినదైనను, ఉపక్రమించుచున్న
కర్మమునకు నిట్టియధిష్ఠానాదులయందుఁ గారణ
ములు. ఇట్టికర్మమునందుఁ గారణమట్లుండఁ
గాఁ గేవలఁ దన్నే కర్తఁగాఁ జూచువాఁడు చెడిన

బుద్ధిగలవాఁడగుటవలన ఆత్మతత్త్వమునుజూడఁడు. నేననేడి భావములేనివాఁడును, బుద్ధిలిప్తముగాని వాఁడును,నగుఁబురుషుఁడు ఈజనులను జంపియును జంపినవాఁడుగాఁడు, బద్ధుఁడునుగాఁడు; కర్మోపదేశము జ్ఞానమనియుఁ, దెలియఁదగినదనియుఁ, దెలిసినవాఁడనియు, మూఁడువిధములుగలది. కర్మసంగ్రహము కారణమనియుఁ, గర్మమనియుఁ, గర్తయనియు, మూఁడువిధములుగలది. కాపిలాది శాస్త్రములయందు జ్ఞానము, క్రియయుఁ,కర్తయు, సత్త్వరజస్తమోగుణభేదమువలన మూఁడుప్రకారములుగాఁ జెప్పఁబడుచున్నది. అట్టిజ్ఞానాదులను యథాశాస్త్రముగావినుము. భిన్నములయిన సర్వభూతముల యందు నఖండంబయినదియు నాశరహితమయినదియు, ఏకమయినదియు, నగుఁ బరమాత్మస్వరూపమును జూచునట్టిజ్ఞానమును సత్త్వగుణమువలనఁ బుట్టిన దానినిగాఁ దెలిసికొనుము; సమస్తభూతములయందును భేదభావములచే భిన్నప్రకారములయిన వానినిగాను, నానాస్వరూపములయినవానినిగాను దెలియుచున్న జ్ఞానమును రజోగుణ సంబంధమయిన దానినిగాఁ దెలిసికొనుము;

ఏకమగుఁబ్రతిమాదిరూపమునందుఁ గూడినదియు, సర్వవిషయమయిన దానివలెనున్నదియుఁ, గారణములేనిదియుఁ, దుచ్ఛఫలప్రదమయినదియు, యథార్థముగానిదియు నగు జ్ఞానము తమోజనితమయినదని చెప్పఁబడెను. ఫలాపేక్షలేనివానిచే రాగద్వేషరాహిత్యమువలనఁ జేయఁబడునదియు, నిత్యమయినదియు, ఆసక్తిరహితమయినదియునగుఁ గర్మము సత్త్వగుణ సంబంధమయినదని చెప్పఁబడుచున్నది. కోరికనుబొందనిశ్చయించిన కర్తచే నహంకారముతోఁ గూడుటచే నధికక్లేశముగల యేకర్మమును జేయఁబడుచున్నదో అట్టి కర్మమును రజోగుణమువలనఁబుట్టినదని చెప్పఁబడును, *అనుబంధమును, హింసయును, నాశనమును, సామర్థ్యమును, విచారింపక అజ్ఞానమువలన నారంభింపఁబడెడి కర్మము తామసమని చెప్పఁబడును. ఆసక్తిరహితుఁడును, అహంకారరహితుఁడును, ధైర్యోత్సాహముతోఁ గూడినవాఁడును, బ్రాప్త్యప్రాప్తులయందు వికారములేనివాఁడును నగుఁ గర్తసాత్త్వికుఁడని చెప్పఁబడుచున్నాఁడు. అనురాగముగలవాఁడును, గర్మఫలమునుబొంద నిశ్చయించినవాఁడును, ద్రవ్యాభి

---

* అనుబంధము = ముందుజరగఁబోవుకార్యము.

లాపియును, బరులకుఁ బీడచేయు స్వభావముగల వాఁడును, ఆచారవర్జితుండును, సంతోషదుఃఖముల తోఁ గూడినవాఁడును, నగుఁ గర్తరాజసుఁడని చెప్పఁ బడుచున్నాఁడు. మనోనిగ్రహము లేనివాఁడును, బుద్ధిహీనుండును, స్తబ్ధుండును, మాయావియును, బరుల నవమానించు స్వభావము గలవాఁడును, మందుఁడును, దుఃఖ శీలుండును, ఆలస్యముగాఁ బనులు చేయువాఁడును, నయిన కర్త తామసుఁడని పలుకఁబడుచున్నాఁడు. ఓయర్జున! నిశ్శేషముగా వేరుపరచుటచేఁ జెప్పఁబడు సత్త్వాదిగుణమువలన మూఁడు విధములుగల బుద్ధిధైర్యముల భేదమును వినుము. ఓయర్జున! కర్మమోక్ష మార్గములను గర్తవ్యాకర్తవ్యములను భయాభయములను బంధక ములను మోక్షంబును దెలియుచున్నబుద్ధి, సాత్త్వి కమయినది. ఓధనంజయ! ఏబుద్ధిచే, ధర్మమును అధర్మమును జేయుదానిని జేయనిదానిని యథా ర్థముగానట్లు తెలియఁ జేయునట్టిబుద్ధి, రాజసమయి నది. ఓయర్జున! తమస్సుచేఁగప్పఁబడినదయి,నిషిద్ధ ధర్మమును యుక్తధర్మముగాను, సమస్తపదార్థము లను బ్రతికూలముగాఁ దలంచుచున్నబుద్ధి, తామస మవుచున్నది. ఓకురునందన! యోగముచేవ్యభిచార

గానిదియు, మనః ప్రాణేంద్రియముల క్రియలు నియమింపఁబడు ధైర్యము సాత్త్వికమయినదగు. ఓయర్జున ! ఫలమునాశించు పురుషుఁడు, ఆసక్తిచే ధర్మార్థకామములను ఏధైర్యముచే ధరించుచున్నాఁడో అట్టిధైర్యము రాజసమయినదియగు. కుత్సిత మనుష్యుఁడుఏ ధైర్యముచేభయమును, నిద్రయును, దుఃఖమును, దిగులును, మదమును, విడువఁడో అట్టి ధైర్యముతామసమయినదగు. ఓయర్జున! మూఁడు విధములయిన సుఖమును ఇప్పుడు నావాక్యవలన వినుము. ఏసుఖానుభవమునందు అభ్యాసము వలనఁ గ్రీడించుచున్నాఁడో, దుఃఖనాశముఁబొందుచున్నాఁడో, అట్టిసుఖము తొలుతవిషమువలెను, అంత మందు నమృతతుల్యమువుచున్నదో, స్వబుద్ధినైర్మల్య మువలనఁ బుట్టినట్టి సుఖము సాత్త్వికమనిచెప్పఁ బడెను. విషయేంద్రియ సంబంధమువలన ఎట్టి సుఖము మొదట నమృతతుల్యముగాను, అంతము నందు విషమువలెనవుచున్నదో, అట్టిసుఖము రాజ సమయినదనిచెప్పఁబడెను. ఏసుఖము, అనుభవ కాలమునందును, విపాకమునందును, దనకుమోహా కరమయినవోనిద్రాలస్య ప్రమాదములవలనఁబుట్టిన యీమూఁడు గుణములచే విడువంబడిన ప్రాణి

జాతము, భూమియందుమానవులయందైనను, స్వర్గమునందు దేవతలయందైనను, లేదు. ఓయర్జున! బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకును శూద్రులకును క్రియలు ప్రకృతివలనఁబుట్టిన సత్త్వాదిగుణంబులచే విభజింపఁబడియున్నవి. అంతరింద్రియ నిగ్రహంబును, బహిరింద్రియనిగ్రహంబును, తపస్సును, శుచిత్వంబును, ఓర్పును, ఋజుత్వంబును, జ్ఞానంబును, అనుభవజన్యజ్ఞానంబును, ఆస్తిక్యంబును నగు నివిబ్రహ్మసంబంధమగు స్వభావమువలనఁ బుట్టిన కర్మంబులగుచున్నవి. శూరత్వంబును, ప్రాగల్భ్యంబును, ధైర్యంబును, సామర్థ్యంబును, యుద్ధమునందుఁబారిపోకుండుటయు, దానంబును, సకలజనుల నేలుటయును, ననునివిక్షత్రియ సంబంధమయిన స్వభావమువలనఁ బుట్టిన కర్మంబులగుచున్నవి. దున్నుటయు, గోసంరక్షణంబు సేయుటయు, వ్యాపారంబు సేయుటయు, నను నివి వైశ్య సంబంధమయిన స్వభావమువలనఁ బుట్టిన కర్మంబులగుచున్నవి. సేవారూపకమయినకర్మముశూద్రునికి స్వభావజనితంబయినది. మానవుండు తనతనధర్మమునందాసక్తుండయిన, సిద్ధినిఁబొందును. స్వకీయ కర్మమునందాసక్తుండైనవాఁడు ఏవిధమున సిద్ధిఁ

బొందుచున్నాఁడనిన అట్టికర్మవిధానంబును నావా క్యవలననేవినుము. ప్రాణులనుత్పత్తి సేసిన వాఁడును, సమస్తజగత్తును వ్యాపింపఁజేసిన వాఁడును నగు నీశ్వరుని, మనుష్యుఁడు స్వకీయకర్మంబు చేఁ బూజించి యోగ్యతను బొందుచున్నాఁడు. కించిద్గుణముగలదైనను, స్వధర్మము లెస్సగా నాచ రింపఁబడిన, యితరధర్మమునకంటెను శ్రేష్ఠంబగు చున్నది. స్వభావముచేనియతంబయిన కర్మము సేయుచున్నజనుఁడు పాపమును బొందఁడు. ఓ యర్జున! దోషముతోఁ గూడినదయినను స్వభావ జన్యమయిన కర్మమును విడువఁగూడదు. సమస్త కర్మములు పొగచేనగ్నివలె దోషముచేఁగప్పఁబడి యున్నవి. సమస్తమందును సంగరహితబుద్ధిగల వాఁడును, జయింపఁబడిన మనస్సుగలవాఁడును, ఉడిగినయాశలు గలవాఁడును, నగునరుఁడు కర్మ సన్న్యాసంబుచే నత్కృష్టమగు నిష్క్రియాత్మ సంసిద్ధిని బొందుచున్నాఁడు. ఓయర్జున! యోగ్య తను బొందు నట్టి విధముననే శ్రేష్ఠమయిన జ్ఞాన నిష్ఠను సంక్షేపముగా నావాక్యమువలనఁ దెలిసి కొనుము. మాయారహితంబగు బుద్ధితోఁగూడిన వాఁడై ధైర్యముచే నాత్మనువశీకరణము సేసికొని

శబ్దము మొదలుగాఁగల విషయములను విడిచి రాగ
ద్వేషములను విడనాఁడిరహస్యస్థలమందున్న వాఁడ
గుచు సదాధ్యానయోగములందాసక్తుఁడయి వైరా
గ్యము నాశ్రయించిన వాఁడగుచు అహంకార
దర్పములను, కామక్రోధములను, బాహ్యవస్తు
పరిగ్రహంబును, విడనాడి మమకార రహితుండయి
ఉడిగినహర్షా౽యాసాదులుగల వాఁడయియుం
డెడి జ్ఞాననిష్ఠుఁడు బ్రహ్మభావముకొఱకు సమర్థుఁ
డగుచున్నాఁడు అట్టి బ్రహ్మనిష్ఠుని లక్షణము సెప్పు
చున్నానువినుము. బ్రహ్మనిష్ఠుఁడు నిర్మలమయిన
మనస్సుగలవాఁడయి నష్టమయిన వస్తువునుగూర్చి
దుఃఖింపఁడు; రానివస్తువునుగోరఁడు. సమస్త
ప్రాణులయందును సముఁడయి శ్రేష్ఠమగు, నా
యందలిభక్తినిఁ బొందుచున్నాఁడు. నేనెంతవాఁ
డనో ఎట్టివాఁడనవుచున్నానో అట్టినన్ను భక్తి
చేత యథార్థముగాఁ నెఱుంగుచున్నాఁడు. నేనే
ప్రాప్యస్థానముగాఁగలవాఁడు, సదాసమస్త కర్మ
ములను జేయుచున్నవాఁడైె నాయనుగ్రహమువలన
నాశరహితమయినదియు స్థిరమయినదియు నగుఁ
బరమపదమును బొందుచున్నాఁడు. కావున నీవు

* వివేకబుద్ధిచే సమస్త కర్మములను నాయందుంచి నేనేయుత్కృష్టముగాఁ గలవాఁడవయి బుద్ధియోగము నాశ్రయించి సదానాయందు మనస్సుగలవాఁడవగుకమ్ము; నాయందే మనస్సుగలిగిన, నీవు నాయనుగ్రహంబువలన సమస్తదుఃఖముల నతిక్రమింపఁగలవు. అట్లుగాక గర్వముచేవినకపోతివేని, చెడిపోఁగలవు. అభిమానమునాశ్రయించి యుద్ధముసేయనని తలంచితివేని నీవగు నీనిశ్చయ మబద్ధమగుచున్నది. ఏలననగా నీస్వభావము నిన్నుని యోగింపఁగలదు. స్వభావమువలనఁ బుట్టినస్వకీయ కర్మముచేఁ గట్టుపడినవాఁడవయి యేకర్మమునుజేయుటకిచ్ఛయింపవో ఆకర్మమును అవివేకమువలనఁబరవశుండవై యే చేయఁగలవు. ఓయర్జున! జగన్నియామకుండును సమస్తప్రాణుల హృదయప్రదేశమందు దేహములనధిష్ఠించియున్నవాఁడును, సమస్తజీవులను నిజశక్తిచే భ్రమింపఁ జేయుచున్నవాఁడునునైయున్నాఁడు. ఓయర్జున! సర్వాత్మభావంబుచే నాయీశ్వరుని రక్షకునిఁగాను బొందుము. ఆ యీశ్వరానుగ్రహంబువలన శ్రేష్ఠమయిన చిత్తనైర్మల్యంబును శాశ్వతంబయినస్థాన

---

* వివేకబుద్ధి = వివేకముతోఁగూడినబుద్ధి.

మును బొందఁగలవు. ఈప్రకారంబుగా గోప్య ములకంటెను మిగుల గోప్యంబయిన జ్ఞానము నాచేఁజెప్పఁబడెను. ఈజ్ఞానశాస్త్రమునుసాకల్యం బుగాఁ విచారించి యేప్రకారముగా నిచ్చయించు చున్నావో ఆప్రకారముగాఁ జేయుము; మరల, సమస్త ములయందు మిగుల గోప్యమయినదియు, శ్రేష్ఠ మయినదియు నగు నావాక్యమును వినుము. నీవు నాకునిశ్చయముగాఁ బ్రియుఁడవైతివి. అట్టికార ణంబువలన నీకుహితంబు సెప్పెదను, అదెట్లనిన నా యందు మనస్సుగలవాఁడవును, నాయందుభక్తిగల వాఁడవును నన్నేపూజించువాఁడవును గమ్ము. నన్నె నమస్కరింపుము. అట్లుచేసెదవేని నన్నేపొంద గలవు. నాకుఁబ్రియుండవయితివి. నీకొఱకుప్రతిజ్ఞ సేయుచున్నాను. సమస్తకర్మములను విడిచిముఖ్యుఁ డయిన నన్ను రక్షకునిగాఁ బొందుము. నేను నిన్నుబంధములలోనుంచి విడిపింపఁగలను, దుఃఖిం పకుము. జ్ఞానమార్గము తెలియుట కొఱకుఁజెప్పఁ బడిన నీగీతాశాస్త్రము తపస్సులేనివాని కొఱకును, విననివానికొఱకును, నన్నుఁగూర్చి ఆయాసపడు వానికొఱకును, ఒకప్పుడును ఉపదేశింపఁ దగినది కాదు. ఎల్లప్పుడును శ్రేష్ఠమయినదియు, గోప్య

మయినదియునగు నీగీతాశాస్త్రంబును నాభక్తుల
విషయమయి చెప్పఁ గలవాఁడు నాయందుఁ బరమ
భక్తిని జేసి నన్నే పొందఁగలఁడు. వాని కంటెను
మనుష్యులయందు నాకుమిక్కిలి ప్రియమును జేయు
వాఁ డొక్కండును లేఁడు. భవిష్యత్కాలమందును,
వానికంటె నితరుఁడు, నాకుభూమియందు నిష్టుం
డయినవాఁడుఁ గాఁ గలవాఁడు కాఁడు. ధర్మముతోఁ
గూడినమన సంవాదంబగు నీగ్రంథమును పఠింపఁ
గలపురుషునిచేతను, జ్ఞానయజ్ఞము చేతను, నేను
పూజింపంబడినవాఁడ నౌదునని నానిశ్చయము. విశ్వా
సముగలవాఁడును అసూయారహితుండును నయి
ఈగ్రంథమును వినువాఁడు ముక్తుండయి ప్రశస్తము
లయిన పుణ్యకర్మములగు జేసినవారల లోకమును
బొందును. ఓయర్జున! నీచే నేకాగ్రంబయినమనస్సు
చే నీగీతాశాస్త్రము వినంబడెనా యేమి? అజ్ఞాన
నిమిత్తంబగు నీయవివేకము పోయెనా యేమి?

అర్జునునివాక్యము.

ఓయచ్యుత! నీయనుగ్రహంబున నాయవివే
కముపోయెను, ఎఱుకను బొందితిని. నేనుసందే
హములేనివాఁడనైతిని, నీవచనము సేయఁగలను.

## సంజయునివాక్యము.

ఇవ్విధంబున, ఇట్టియాశ్చర్యంబయినదియు, రోమహర్షణంబయినదియునగు మహానుభావులగు వాసుదేవార్జునుల సంవాదంబును నేవింటిని; వ్యాసానుగ్రహంబువలన, యోగమను పేరుగలదియు, ఉత్కృష్టంబయినదియునగు నిట్టిరహస్యమునుదానే ప్రత్యక్షముగాఁ జెప్పుచున్నవాఁడును, యోగమునకుఁ బ్రభువైనవాఁడును నగు శ్రీకృష్ణునివలన నేను విన్నవాఁడనయితిని. ఓయిధృతరాష్ట్రా! అద్భుతమయినదియుఁ, బుణ్యమయినదియుఁ, బావనమయినదియు నగు కేశవార్జునుల సంవాదంబుదలంచి తలంచి మాటిమాటికిని సంతోషించు చున్నాను. ఓయిధృతరాష్ట్రా! మిగుల నద్భుతంబగు వాసుదేవుని విశ్వరూపంబును లెస్సగా ధ్యానముసేసి నాకధికమయిన యాశ్చర్యమగుచున్నది; మాటిమాటికిని, పులకాంకురము గలవాఁడనగుచున్నాను. యోగీశ్వరుండగు శ్రీకృష్ణుండును ధనుర్ధరుండగు నర్జునుండును ఏపక్షమందుఁగలరో ఆపక్షమందే

సంపత్తును, జయమును, ఐశ్వర్యమును, స్థిరమయి ననీతియును, గలుగుచున్నవని నాయభిమతము.

ఇది శ్రీభగవద్గీతా వచనంబను యోగశాస్త్రంబున శ్రీకృష్ణార్జునసంవాదంబునందు మోక్షసన్యాసయోగము పదునెనిమిదవయధ్యాయము.

సంపూర్ణము.



యదక్షరపదభ్రష్టం। మాత్రాహీనంచయద్భవేత్।తత్సర్వంక్షమ్యతాందేవ।నారాయణనమోస్తుతే.

